


సంపుట : ౮. ప్రమాది, భాద్రపదము : సెప్టెంబరు, 1939. సంచిక : ౧.

# ఇండియాకార్యదర్శి లొంగుటకు ఆంధ్రులు ప్రబలాందోళనచేయాలి

ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్రము కావలెనను వాంఛ, 25 వత్సరముల క్రితమే పుట్టినది. భారత జాతీయ మహాసభ (కాంగ్రెసు) ఆంధ్రులకు కాంగ్రెసురాష్ట్ర మొసంగి, 20 ఎండ్లక్రితము భాషాప్రయుక్త రాష్ట్రములుగా దేశమంతటిని విభజించినప్పటి నుండియును, తెలుగుభాష మాటలాడే ప్రజలందరి లోను హెచ్చుసమైక్యభావము, భ్రాతృభావము ప్రకటితమౌతూవచ్చినవి. ఈలోపున చాల కార్యక్రమం జరిగింది.

ఆంధ్రమునకు ప్రత్యేకాంధ్రరాష్ట్రము కావలెననువాంఛ ప్రాముఖ్యము వహించినది. దానిని ముఖ్యమైన అన్ని ప్రాంతములలోను గుర్తించుచున్నారు. ఆంధ్రరాష్ట్రము ఒక రాజకీయ ప్రాంతముగా అత్యంత త్వరితముగ ప్రారంభించు ఆవశ్యకత గురించిగాని, దానిలోని సదుద్దేశము గురించి

## 21-వ ఆంధ్రమహాసభలో శ్రీమాడభూషి అనంతశయనం అధ్యక్షోపన్యాసంనుండి.

గాని నిజముగా శంకించ కలిగే టటువంటి వ్యక్తి ఆంధ్రదేశములో గాని, బయటగాని ఎవ్వరును లేరని తలపవచ్చును.

భాష, ఐకమత్యముకూర్చే మహాశక్తి; సమైక్యమతముకంటే కూడ ఎక్కువ శక్తులు కలిగినది. ఈ భాషానుబంధము చేతనే అన్ని రకముల రాజకీయ మతములకు చెందినవారును, వివిధమతములకు జాతులకు, శాఖలకు చెందినవారును ఇందులో చేరిరి. ఏకభాష మూలముగా ఏకముఖమైన భావనా దృష్టి ప్రకటించుచున్నారు. సమంచితమైన రాజకీయ సూత్రములదృష్ట్యా పరికించినట్లయితే, ఒక భాషమాటలాడే ప్రజలు కలసి మెలసి ఒకే విశాలప్రాంతములో నివసించినచో వారిని ఒక ప్రత్యేక రాష్ట్రముగా భావించి, వారి వ్యవహారములు వారు సరిచూచుకొను అవకాశ మొసంగవచ్చును. మన దేశమువంటి దేశములో ఆవిధమైన స్వయంపరిపాలక భాషారాష్ట్రముల నేర్పఱచుటవలన యావత్ దేశక్షేమమునకు లాభించును; ఒక తెగ ప్రజలు మఱియొక తెగపై పెత్తనము వహించకుండ చేయును. ప్రపంచ యుద్ధానంతరము పాశ్చాత్య ప్రపంచములో, చిన్నచిన్న దేశీయులైన పోల్సు, జెక్కులు, సోవాకులు మొదలగు

వారికికూడ స్వాతంత్ర్యమొసంగిరి మనము ప్రత్యేకరాష్ట్రము కావలెనని కోరు యీ యభిలాష, కేవలము మనోభిప్రాయము మాత్రమే కాదు. ఆ విధముగానైతేనే మన ఆర్థిక, సాంఘిక, విజ్ఞానాభివృద్ధులు, మన రాజకీయ విముక్తి కూడ సిద్ధింపగలడని మనము దృఢముగా విశ్వసించు చున్నాము.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణము ప్రస్తుతము వాయిదా వేయవలసినదని కొందరి అభిప్రాయముగా ఉంటూ వచ్చినది. దానికి కారణము, ఈ విభజనవలన చాలపెద్ద ఆర్థిక కష్టాలూ, బాధ్యతలు తలపైన వస్తాయేమో యను భయమే. ఈ భయము అనేకసభావేదికలపైన లెక్కలేనన్నిసారులు వెల్లడించి వున్నారు. ప్రస్తుతము మనము చేయుచున్న ఆందోళనాపరిస్థితులలో ఈ సందర్భము గురించి చెప్పే వాదములగూర్చిపునరుక్తిగా తెలుపనక్కరలేదు. వాయిదా వేయుటకు అనుకూలమైన వాదములు సక్రమమైనవే అనుకొందాము! ప్రత్యేకరాష్ట్రముయొక్క లాభాలే యీకల్పిత కష్టాలుకంటె హెచ్చు తూగును. సింధుకు, ఉత్తర సరిహద్దుకు, ఆస్సాముకు, ఒరిస్సాకు ప్రత్యేక రాష్ట్రాలు నిర్మించేటప్పుడు ఇటువంటి ఆక్షేపణలేమైనా వచ్చినవా? ఈ రాష్ట్రములన్నియును, ఈనాటికి కూడ కేంద్రప్రభుత్వముయొక్క ఆర్థిక సహాయముపైన ఆధారపడియున్నవి; యీరాష్ట్రాలలో కనీసము రెండు రాష్ట్రాలయినా ఎన్నడు స్వయంపోషకము అగుటకు అవకాశంలేకుండా వున్నవి. ఈ రాష్ట్రములంత అధ్వాన్నస్థితిలో ఆంధ్రులు లేరు. ఈ పరిస్థితులలో ఆంధ్రులమైన మనమొక్కళ్ళమూ ప్రత్యేక రాష్ట్రంలేకుండా ఎంతకాలము వేచియుండగలము? ఈ సమావేశంలో నిశ్చయించవలసిన ముఖ్యాంశమే యిది!

కాంగ్రెసు వర్కింగుకమిటీ క్రిందటి సంవత్సరము చేసిన తీర్మానములో ఎటువంటి యభిప్రాయము, ఉద్దేశం ఉన్నప్పటికీకూడ, బొంబాయిలో అఖిలభారత కాంగ్రెసు కమిటీ ఇటీవల సమావేశమైనపుడు, ఆంధ్రరాష్ట్రము త్వరలో నిర్మాణముచేయుటకు తగిన చర్యలు తీసికోవలెనని నిశ్చయం చేశారు. కాంగ్రెసు వారందరును, కాంగ్రెసు ప్రభుత్వము లన్నియును, ఆనిశ్చయమునకు కట్టుబడి యుండవలసినదే! మనదేశములోని కాంగ్రెసు ప్రభుత్వము లన్నియును, ఈ విషయముగూర్చి తగిన చర్యలు తీసికొని ఈ నిశ్చయమును అమలుపఱచవలసినదే. ఊరికే కబుర్లతో కాలక్షేపము చేసిన మాత్రముచే లాభములేదు. మద్రాసు ప్రధానమంత్రి శాసనసభా భవనములో తాము చేయగలిగినంత చేసితిమనియును, అయినను, ఇండియా కార్యదర్శినుండి తమకు ప్రతికూలమైన జవాబు వచ్చినదని చెప్పనేచెప్పిరి. ముఖ్యముగా ఆంధ్రరాష్ట్ర నిర్మాణము గురించి ప్రత్యేకించి తిరిగి వారు విజ్ఞాపనములు చేసినట్లుగా ఉన్నది. కాని వారికివచ్చిన ప్రత్యుత్తరములో, నూతన సంస్కరణల ఫలితముగా వచ్చిన నూతన వాతావరణముచే భారతదేశ మంతటను కూడ ఇట్టివాంఛలు ప్రబలవచ్చునని తెలిపిరట. మిత్రులారా! ఇండియా కార్యదర్శి అవలంబించిన ఈవిధానము కేవలము తప్పించుకొనుటకు చేసినసాకు అని నేను చెప్పక తీరదు. తప్పించుకొనే విధానమునకు కారణము పూర్వపు సామ్రాజ్యాధికార గర్వమేయని చెప్పకతీరదు. రెండున్నరకోట్ల ఆంధ్రుల ఏకైకకంఠవాంఛను తాను అలక్ష్యము చేయవచ్చునని ఇండియా కార్యదర్శి తలంచుచున్నాడు. అందుచేత మన మొఱ్ఱలు వినునట్లు చేయవలెను; మన కార్యసిద్ధికి మనశక్తిపైననే ఆధారపడవలయును. మరల ఇండియా కార్యదర్శిగుమ్మముకడ పడిగాపులుకాచి వేడుటకంటె మన స్వయంశక్తిపైననే ఆధారపడి యుండవలెను. కాంగ్రెసువారు ఎవ్వరును ఇండియా కార్యదర్శికి విజ్ఞప్తులు పంపరాదని కాంగ్రెసు చేసిన నిశ్చయము సముచితముగానే యున్నది. కాంగ్రెసేతరులుకూడా ఈవిధానమునే అనుసరించవలెనని నా దృఢవిశ్వాసము.

ఎనిమిది రాష్ట్రములలో పరిపాలన చేయుచున్న కాంగ్రెసు సంస్థయే ఈ కార్యము నెరవేర్చలేనిచో, మఱియే యితరసంస్థకూడ దీనిని చేయజాలదు. మోంటుఫోర్డు సంస్కరణము ప్రారంభించిన తర్వాత, ఆంధ్రులు ముగ్గురు ప్రధాన మంత్రులుగా పనిచేసిరి. వారు పానగల్లురాజా, శ్రీ బి. మునిస్వామినాయుడు, బొబ్బిలిరాజాగారలు, సర్ కె. వి. రెడ్డిగారు గవర్నరుగా కూడ పనిచేసిరి. 18 యేండ్లు మద్రాసు పరిపాలనచేసిన జస్టిస్ మంత్రివర్గము కేంద్రప్రభుత్వము పైనగాని, ఇండియా ప్రభుత్వకార్యదర్శిపైనగాని యీ విషయమై ఏవిధమైన ఒత్తిడికలిగించుటకు ఏ పనియును చేయలేదు. నేడు, ఒక యభిమానాంధ్రుడు శ్రీ ఈడ్పుగంటి రాఘవేంద్రరావుగారు ఇండియాకార్యదర్శికి సలహాదారుగా పని చేయుచున్నారు.

వారి మద్రాసురాక, వారిటీవలచేసిన ఉపన్యాసములు మనలో ఎన్నో ఆశలు కలిగించినవి. మన యెత్తుల విధానముగూర్చి మద్రాసుప్రభుత్వము అవలంబించిన పద్ధతులగూర్చి విమర్శించిరి. కాని, ఏ విధాన మవలంబిస్తే బ్రిటిషుప్రభుత్వముపైన సరిగా పనిచేయునో చెప్పలేదు. ఆవిషయమై మౌనముద్రాలంకారులై వున్నారు. బ్రిటిషుహృదయము ఏ విధముగా పని చేయునో వారికి ఇటీవల లభించిన పరిచయఫలితముగా ఇంకా మనకు సలహాలనిచ్చి చక్కని సహాయము చేయగలరని ఆశింతుముగాక! నేనిదివరకు మనవిచేసిన రీతిగా మన స్వయంశక్తిమీదనే ఆధారపడవలెనని కోరుచున్నాను.

ప్రధాన మంత్రి మద్రాసు శాసనసభ అంతటినుండియును కేవలాంధ్రరాష్ట్రనిర్మాణమును గూర్చి ఏకగ్రీవవాంఛగా 'మేండేటు' పంపవలెనని మనకు సలహా యిచ్చిరి.

ఆ తీర్మానమును సభవారందరును ఆమోదించునట్లు చేయుట అంత కష్టముకాదేమో! మద్రాసు శాసనసభలోని సభ్యులందరును కాంగ్రెసు కాంగ్రెసేతర భేదము లేక, ఆంధ్ర ఆంధ్రేతర భేదము లేక అట్టి తీర్మానమును బలపఱచవలెనని ప్రార్థన. నిజమునకు ప్రత్యేకరాష్ట్రాన్ని కోరువారిలో ఆంధ్రులే అగ్రగణ్యులని చెప్పితీరవలెను. ప్రత్యేకాంధ్రరాష్ట్రాన్ని వెంటనే నిర్మించునట్లు చేయవలెనను తీర్మానమును కేంద్రశాసనసభలోని కాంగ్రెసు పార్టీలచేత ప్రవేశపెట్టవలెనని కాంగ్రెసు వర్కింగుకమిటీ కోరవచ్చును. ఇదియంతయును ఎటులున్నప్పటికిన్నీ, అఖలభారత కాంగ్రెసుకమిటీ ఇటీవలచేసిన తీర్మానమునుబట్టిచూడ కాంగ్రెసు వర్కింగుకమిటీ సలహాలతో, వివిధ రాష్ట్రాలలో పనిచేయు కాంగ్రెసు మంత్రులందరును, తమకు గలిగిన ప్రతియవకాశములోను యీ విషయమునుగురించి పట్టుబట్టుట విధిగా తలంపవలెనన్నట్లు తోచుచున్నది.

ఈవిషయమై కేంద్రప్రభుత్వమును, ఇండియా కార్యదర్శిని విధిగా కలుగజేసికొనునట్లు ఒత్తిడి కలిగించవలెనన్నట్లున్నది. అఖిలభారత కాంగ్రెసుకమిటీ చేసినతీర్మానము అఖిలభారతకాంగ్రెసు వర్కింగుకమిటీ అమలు జరుపుననియును, కాంగ్రెసు ప్రధానులందరును ఈవిషయమై తగుచర్య తీసికొనునట్లు చేయుననియును తలంపవచ్చును ఈకోరిక వెంటనే తీర్చనియెడల శాసనసభలోని సభ్యులు సముచితసమయములో రాజీనామాయిచ్చి రావలెనని వర్కింగు కమిటీ ఉత్తరువులు చేయవలెను. మద్రాసు ప్రధాని రాజగోపాలాచారిగారు, శాసనసభ తీర్మానమును అమలులోనికి తీసికొని వచ్చుచున్నందులకు మన ప్రయోజనమును సాధించుటకు వారొసంగిన అమూల్యమైన సలహాకును, వారికి మన ధన్యవాదములు సమర్పింపవలసియున్నది.

ఇటీవల ఎ. ఐ. సి. సి. చేసిన నిశ్చయము వారికి మఱింత ధైర్యమొసంగి, మన ఏకగ్రీవవాంఛను ఇండియా కార్యదర్శి లొంగుటకు తగిన ప్రబలచర్యలు వారిచేత తీసికొనునట్లు చేయునని విశ్వసించుచున్నాను.

# ఆంధ్రరాష్ట్ర నిర్మాణవిషయంలో మహాత్ముణ్ణిదర్శించి ప్రార్థిద్దాము

**21-వ ఆంధ్ర మహాసభలో శ్రీకొండా వెంకటప్పయ్యపంతులు ప్రారంభోపన్యాసం నుండి.**

మహమ్మదీయప్రభుత్వమును, ఆంగ్లేయపాలనయు సాగించబడిన పిమ్మట ఆంధ్రదేశము విడగొట్టబడి పరరాజుల స్వాధీనమైనది. మదరాసు రాజధానిలోని ఆంధ్రులు తమిళ, కర్ణాటక, మలయాళదేశములవారితో నొక్కటిగ చేర్చబడి స్వయంవ్యక్తిత్వమును గోల్పోయి పరభృతులవలె పాటింపబడుచున్నారు.

కావుననే ఆంధ్రజిల్లాలను చెన్నరాజధానినుండి విడదీసి ప్రత్యేకముగా నేర్పాటుగావించుకొని ఆత్మీయవ్యక్తిత్వమును బడసి, ఐకమత్యమును వృద్ధిగావించుకొని భారతదేశమునందలి యితరజాతులవలెనే పలుకుబడియు, ప్రాధాన్యతయు సముపార్జించుకొనవలెనను యుద్దేశ ముత్పన్నమగుటతోడనే ఆంధ్రోద్యమము ప్రారంభింపబడినది. ఆ యుద్యమము ఈ పట్టణమునుండియే ప్రథమమున సాగినదని తమకందరికిని విశదమే. మఱియును ఆంధ్రరాష్ట్రభావాంకురములు ఇచ్చటి యువకుల హృదయములందే మొదట ఉత్పన్నములైనవి. నిదురనుండి ఆంధ్రమహాజనులను ప్రబోధించిన మేల్కొల్పు ఇచ్చటనుండిరా ఆంధ్రదేశమునంగలి వివిధ ప్రాంతములందును ప్రతిధ్వనించినది. ప్రథమాంధ్రమహాసభయు ఈ జిల్లాలోని బాపట్లలో అత్యంతవైభవముతో అత్యుత్సాహముతో సమావేశపరుపబడినది. కావున ఈ యిరువదియొకటవ ఆంధ్రమహాసభ ఈపట్టణమున గూడుట మిక్కిలి సందర్భోచితముగా నున్నది. ప్రథమమహాసభజరిగిన నాటినుండియు చాలవరకు ప్రతియేట మహాసభలు ఆంధ్రదేశమున ముఖ్యస్థానములలో సమావేశమగుచుండినవి. ఆ సభలలో ఆంధ్రులు వేనవేలుగ జేరి ఆంధ్రరాష్ట్రము గావలయునని తీరుమానములు గావించి ప్రభుత్వమువారికి పంపుచుండిరి. మాంటేగుఛలమ్సుఫర్డు సంస్కరణలు విచారణలో నున్నప్పుడు వారిరువురును చెన్నపట్టణమునకు విచ్చేసినందున ఆంధ్రదేశమునందలి వివిధమండలములనుండి నాయకులగువారు జేరి వారిని దర్శించి భారతదేశము భాషాప్రయుక్తరాష్ట్రములుగ విభజించుట యావశ్యకమని వివరించి ప్రత్యేక ఆంధ్రరాష్ట్రనిర్మాణము గావింపవలసినదని గోరుచు నొక విజ్ఞాపనపత్రమును అందించియుండిరి. అందుకు ఫలితముగ 1919 సంవత్సరమున వెలువడిన సంస్కరణశాసనమునందు ప్రత్యేకనిర్మాణమునకు అవకాశమువలని ఫలితము మనకు చేకూరదయ్యెను. శాసనసభలో రెండుసారులు అనుకూల తీరుమానములు గావింపబడినను అప్పటి ప్రభుత్వమువారు వానిని అంగీకరింపరైరి.

పిమ్మట పండేండ్లకు సైమన్ కమీషను సంస్కరణముల విచారణ ప్రారంభించినప్పుడు కాంగ్రెసు సందేశము ననుసరించి ఆంధ్రులు సైమనుకమీషనును తీవ్రముగ బహిష్కరించిరి. ఆ కమీషనువారిని అనుసరించిన ఇతర రాష్ట్రాలవారికి ప్రత్యేక రాష్ట్రములు సిద్ధించినవి. కాని ఆంధ్రుల కోర్కె వ్యర్థమైనది. ఐనను ఆంధ్రమహాసభలు నడుచుచు వచ్చినవి. కాంగ్రెసు మహోద్యమములో ఆంధ్రులు ఎవ్వరికిని వెనుకబడక త్యాగశీలము ప్రకటించిరి.

తుదకు కాంగ్రెసు పదవీ స్వీకారము అంగీకరించుటచేత కాంగ్రె

[మిగతా ౬౩ పేజీలో.

'తార అగుట చాలా తేలిక. కాని తార అనిపించుకొనుట కష్టము.'

# సినీమా కళ

'దేశకాల పరిస్థితుల్నిపట్టి కథలు ఉండాలి
సెట్టింగులు ఆ కాలానికి సరియైనవి ఐ వుండాలి.
మనుష్యప్రకృతినిపట్టి వేషాలు ఇయ్యాలి.
మనోవిజ్ఞానము తెలిసిన డైరెక్టరుండాలి.
అసభ్యాలు కనుపించకూడదు'

రచయిత:

## శ్రీ గిడ్రాజు రామారావు

### భోగముతారలు

ఈమధ్య సినీమాలలోని కందరూ భోగముస్త్రీలే వస్తున్నారని యీసడించుకొనుచు పత్రికలలో వ్రాయడం మొదలుపెట్టినారు. వ్రాసినారే కాని, దీనిని తప్పుకునే పద్ధతి చెప్పరువారు. సినీమాలే పూర్వాచారాలతో పురాణగాధలు తయారవుతూవుంటే తారలు— అందులో సంసారంచేసే తారలు— నవీనాచారాలవారు ఎట్లా అవుతారు? పోనీ కళావంతులే వస్తున్నారనుకోండి. ఆ ఛండాలవృత్తికంటె ఇది వేయిరెట్లు మెరుగుగదా? ఇప్పుడు వీరు నిజమైన కళావంతులన్నమాట. అనవసరముగా ఘాతుక విమర్శనలువ్రాసి రచయితలు అసలుకు మోసము తేకుందురుగాక!

చూచేవారు సినీమాలోని పాత్రల కష్టాలుచూచి విచారిస్తారు. చెడుజీవితాన్ని చూచి అసహ్యించుకుంటారు. దుర్దశకు దుఃఖిస్తారు. ఆనందానికి ఆనందిస్తారు. అంటే చూచేవారు ఏదో ఆదర్శాన్ని పెట్టుకొనే చూస్తూ ఉంటూఉంటారన్నమాట. ఆయాదర్శమే సత్యమన్నమాట. ఆ అనుభవమును మనిషిపొందితే వాస్తవమును తెలిసికొనగలుగుతాడు. దీనితత్త్వమును తీసేవారు తెలిసికొంటే చూచేవారిని సులభముగా ఆనందపరుపవచ్చును. ప్రేక్షకులు చూచేవారే అవుతారుగాని పాత్రధారులు కాజాలరుగదా! వారి సానుభూతి క్షణభంగురమేగాని నిలకడగా ఉండదు. ఉండాలంటే తీసేవారు చూచేవారుకూడా శ్రద్ధపూని వుండవలసినదే.

### కథ

దేశకాలపరిస్థితులనుపట్టి కథలుండాలి, సెట్టింగులు ఆకాలానికి సరియైనవి ఐఉండాలి. మనుష్యప్రకృతినిబట్టి వేషాలుఇయ్యాలి, మనోవిజ్ఞానము తెలిసిన డైరెక్టరుండాలి. అసభ్యాలు కనుపించగూడదు. Mass appeal అని అన్యాయాలు చూపించగూడదు. ఇవి అన్నియు అందరకు తెలిసిన విషయాలే. కాని వీనిని గమనింపక పోవుటవలననే ఫిల్ములు చెడుతూఉంటాయి.

తెలుగుసినీమాలలో ఉత్తమమైనది వందేమాతరమని వినికిడి. మాలపిల్ల దీనికేమీ తీసిపోదు. ఈ రెంటిలోనూ బ్రాహ్మణాబ్రాహ్మణభేదాలు కనుపిస్తాయి. మాలపిల్లలో బ్రాహ్మణులచెడుప్రవర్తన కనుపించినది. వందేమాతరంలో బ్రాహ్మణకుటుంబమూ అన్నట్లు అనుమానంపుట్టించే కుటుంబము. కాని వారు శూద్రులు. ఈ ఫిల్ములో బ్రాహ్మణుడేలేడు. నిర్మాతల ఉద్దేశ్యము తెలిసికోటానికి చదువరులు స్వతంత్రులు.

చెప్పదలచుకొన్నదేమంటే పైన వివరించిన ప్రమాదాలవలన క్రమేణ రాబడి తగ్గుతూఉంటుంది. తుదకు వీని ఆయువు తగ్గిపోతుంది.

### ఖర్చు

ఇంకొక కారణమేమిటంటే చూచేవారి ఆర్థికదుస్థితి. లక్షలు ఖర్చుపెట్టి ఆ ధనము జనము దగ్గర

వసూలు చేయాలంటే కష్టమే. ఎంతమంచి ఫిల్ముకైనా దినమూ పావలా ఖర్చుపెట్టడానికి మనదేశమునకు శక్తిచాలదు. కాబట్టిఖర్చు తగ్గించుకోవాలి. ఖర్చు తగ్గితే టిక్కట్ల రేట్లు తగ్గించవచ్చును. విదేశాలలో చాలాఖర్చుపెడతారు, ఇచ్చేవారున్నారు గనుక. మనదేశములో బీదవారుఎక్కువ. కనుక టిక్కట్లు చౌకచేయాలి. టిక్కట్లు చౌక చేసికొంటానికి మూలధనము జాగ్రత్తగా వాడుకోవాలి. ఇది అసాధ్యముమాత్రము కాదు.

ఖర్చు ఎట్లాఉంటుందో మాదిరికి Dead End అనే ఫిల్ముయొక్క పద్దువ్రాస్తాను. ఇది అమెరికాలోని విషయము:

| | | |
|---|---|---|
| కథకు | ... | 6,00,000 |
| జీతాలు | ... | 9,00,000 |
| నిర్దేశకుడు | ... | 1,95,000 |
| ఫోటోగ్రాఫరు, ఇంజనీయరు, విద్యుచ్ఛక్తి | ... | 2,40,000 |
| డ్రెస్సు, రంగులు : | ... | 9,75,00 |
| ఫిల్ముతీసేందుకు స్టూడియో ఖర్చు | ... | 4,91,250 |
| సెట్టింగులు మొదలైనవి. | | 2,70,000 |
| నెగటివ్ ఫిల్ము | ... | 1,50,000 |
| ఎడిటింగు | ... | 30,000 |
| పబ్లిసిటీ | ... | 30,000 |
| భీమా | ... | 60,000 |
| ఇంకా చిల్లరఖర్చులు | | |
| మొత్తము | | 40,00,000 |

ఎంతో ఖర్చుపెట్టి ఒక్కరోజల్లాకష్టపడితీసిన ఫిల్ము తెరమీద పదినిమిషాలు నడుస్తుంది. హాలీవుడ్లోపనిలేకుండాఉండే స్టార్లకు వారానికి 15 వేలరూపాయలు జీతాలిస్తారు.......ఈమాదిరిగా ఉంటుంది ఖర్చు. మనదేశములో ఒకఫిల్ముకు లక్షరూపాయిలకు తక్కువకాదు. ఈ ఖర్చుకూడ తగ్గించాలంటే మార్గాలున్నాయి. అవి టెక్నిక్కుకు సంబంధించినవి కనుక వదలివేస్తాను.

## పేరు

చూచేవారు ఫిల్ముకంపెనీ పేరు చూచి మంచిఫిల్ము అనుకొనునట్లే ఫిల్ముపేరుకూడ చదివిభ్రమిస్తారు. ఈసంగతి తీసేవారికి తెలియును. కనుకనే ఆ ఫిల్ముకు నామకరణము ఆకర్షణీయముగా పెడతారు. కథకు పేరు పెట్టడమనేది వాస్తవముగా, చాలాకష్టమైనపనే షేక్స్పియరంతటివాడు As you like it అని వదలివేసినాడు. కథ ఒకటి, పేరు ఒకటి ఎవ్వరూ పెట్టలేరుగదా! పిరికిమనిషిని గురించి కథ వ్రాసి నెపోలియన్ అని వ్రాయడుగదా!

అయితే ఈ రోజుల్లో ఫిల్ముపరిశ్రమ వ్యాపారము గనుక ఎట్లాగైనా ఉండవచ్చునని చాలామంది తలస్తూఉన్నారు. ఫిల్ములు తయారవుతున్నాయి కూడా. అందువలన నేడు నూటికి 90 ఫిల్ములు సార్థక నామధేయాలున్నవికావు. ఫిల్ము రూపాయిలను భ్రమింగేది- తరువాత ఇచ్చేది కనుక ఏదైనా మంచిపేరు పెట్టకూడదా అంటే పేరువలన ఉపయోగముండేరోజు లివికావు. ఉపయోగమువలన పేరు అంటారు నిర్మాతలు. కథఅంతావ్రాసి పేరు పెట్టేవారున్నారు. పేరుపెట్టి కథ వ్రాసేవారూఉన్నారు. ఇతర భాషలోనిముక్కకు భావార్థము పేరుగా పెట్టేవారున్నారు. ఇట్లాంటివి మన తెలుగులో లేవుగాని ఇంగ్లీషు, హిందీలలో చాలాఉన్నాయి.

Modern Youth అంటే జోబన్ కీబస్తీ యట! Three Warriors అంటే అమర్ఆత్మయట. Holy Crime అంటే ఛాయయట! Hot Blood అంటే భారత్ కాలాల్ అట! Unexpected అంటే దునియానమానే! Devils Desire అంటే ఛోటీసీభూల్; Flower G' అంటే పరదేశీపంకా;

## జంటపేర్లు

ఒక్కపేరుతో సంతృప్తిపడకో, వారికి ఏదో అనుమానముండియో రెండుపేర్లుపెడతారు. ఈ రెంటికిని యే విధమైన పోలికఉండదు. సరోజినీ-అంధీదునియా; వందేమాతరం-మంగళసూత్రం; వెంకటేశ్వర మాహాత్మ్యం-బాలాజీ; కూనీకౌన్-కంఠహారము; చూడండి ఎంత విచిత్రముగా ఉన్నాయో. చూచేవారేమనుకుంటాడు?

ఈ రెండుపేర్లు పెట్టుకోవడములో చాలాఅవస్థవున్నది. వీరు బహుశః ఆకర్షణీయముగా ఉండేటందుకు పేరుపెట్టి కథ వ్రాసికొంటారు. ఆపేరుకు సరిగా కథనుసర్దు

కోవాలి. అందుకనికథను అడ్డదిడ్డాలుగా పెంచుతారు. వందేమాతరంఫిల్ముచూడండి. పేరును సమర్థించుకుంటానికి లాటరీ చీటిలో వందేమాతరమని వ్రాయింపజేశారు. అక్కడకూ తృప్తిలేక, భారతమాతబొమ్మ ఒక దానిని కల్పించినారు. అక్కడక్కడ స్వదేశాన్నిగురించి పల్కించారు. అక్కడకూ తృప్తిలేక, 'లేక మంగళసూత్రం' అని అన్నారు. వందేమాతరం అని పేరుపెట్టుకొన్నందుకు నాయకునకు లక్షరూపాయలు దొరికినవి. బస్, పని పూర్తిఅయిపోయింది. పిమ్మట కథ తుంపులు తుంపులుగా ఉంది. ఈ యవస్థ అంతా ఆకర్షణీయమైన పేరుపెట్టుకొనుటకు పట్టుదలపట్టుటయే కారణము. "గృహలక్ష్మి" ఫిల్ముకూడ సార్థకనామధేయమని చెప్పలేము. కాని ఉత్తరహిందూస్థానములోని ఫిల్ములతో పోలిస్తే మన గృహలక్ష్మి, వందేమాతరం ఫిల్ములు పేర్లు చాలా మెరుగు.

కొంతమంది కథ, ఫిల్ముతీయుట పూర్తిఅయిన తరువాతగాని పేరు పెట్టరు. ఇది అంతమంచిది కాదు. పేరునుబట్టి కథ జ్ఞాపకమురావాలి గాని కథవిని పేరు మరచిపోవుట వింతగాఉండును. మన దేశములో నామకరణాన్ని అంతముఖ్యముగా తీసికొంటున్నారో లేదో తెలియదు

చాలాముఖ్యమని నా సలహా!

శరాన్ని బట్టి ఇప్పుడు జడి జరుగుచున్నది.

## సంగీతము

పేర్లు పెట్టియు, ప్రచారము చేసియు తీసేవారు చూచేవారిని ఆకర్షిస్తారు. బాగానేఉన్నది. చూచేవారి నేవిధంగా ఆనందపరుస్తారో చూడవలసిఉన్నది. ఈ రోజుల్లో ఇతరపద్ధతు లన్నిటికంటె సంగీతము పద్ధతి ఒకటి బాగాఉన్నది. కథ ఎట్లా ఉన్నాసరే చక్కని సంగీతముంటే ఫిల్ముకు విజయమనే అనుకుంటారు. నటకులను నిర్ణయించుకొనేటప్పుడు ముందుగా సంగీతాన్ని టెస్టుచేస్తారు. ఈ వాదస్తమెందుకో తెలియదు. తుదకు వారందరకు పాటలు, పద్యాలు ఉండనేఉండవు. ఉన్న వారికి కీర్తనలు పెంచివేస్తారు. ఇందువలన జనులు ఆకర్షింపబడతారని వారి యుద్దేశ్యము. ఈ సంగీతాన్ని గురించి కొంచెము పరిశీలిద్దాము.

## పాటలు

సంగీత కచేరీలకు సినీమాలలో చోటులేదు. సినీమా సంగీతములో శబ్దము-స్వరము-చిత్రము కలిసి ఉంటాయి. రసాని కనుకూలమైన శబ్దాలుంటాయి. పరిస్థితి కనుకూలమైన స్వరముంటుంది. వీనిలో Descriptive, Illustrative అని రెండు రకాలున్నాయి. వర్ణనాత్మకముకొరకు అనవసరముగా ప్రకృతి వర్ణనలు బాగాఉండవు. సినీమా పాటలలో పదలాలిత్యము అసహ్యముగా ఉంటుంది. గూఢమైన పదాలు బాగాఉండవు. సంగీతము అన్నివిధాల బాగా ఉండవలెనంటే న్యూథియేటర్సు, ప్రభాత్ వారి సినీమాలుచూడాలి. The song must create itself a situation అన్నారు. ఈ మాదిరివి దేవికారాణిచిత్రాలలో కనుపిస్తాయి. న్యూథియేటర్సువారు భావకవిత్వాన్ని కూడ ఉపయోగిస్తున్నారు. పాతపాటలనుకూడా ఉపయోగిస్తున్నారు. ఇప్పుడిప్పుడు మన తెలుగుఫిల్ములలో ఈ పద్ధతిలోని సద్గుణమును గ్రహించినారు. ఈ పాటలను వినునప్పుడు ప్రతివాదును ముగ్ధుడైపోతాడని వేరే చెప్పనక్కరలేదు. చక్కని కంఠము ఉంటే చూచేవారు మైమరచిపోతారు. చక్కని ముఖమువలన మైమరుస్తారా అంటే అనుమానమే. చక్కని కండ్లు, మంచి స్వరము కల్గిన పాత్రధారులను ఎంతసేపైనా చూడ బుద్ధిఅవుతుంది.

## కళ

ప్రకటనలవలనను, గ్రామఫోను ప్రచారమువలనను తారలయ్యేవారు చాలామంది ఉన్నారు. తారలగుటకు చాలా పరీక్షలలో ప్యాసు కావలసి ఉన్నది. తార అగుట చాలా తేలికకాని తార అనుపించుకొనుట కష్టము. అందమైనతార, హాయిఅయిన సంగీతమే ఆదర్శమని నిర్మాత లనుకుంటారు. కాని ఈయుద్దేశ్యము అప్రాంతాని కేపనికి

వస్తుందికాని దేశమంతటా చెల్లదు. కళ అనేది ఒక ప్రాంతానికి చెందినదికాదు. ప్రపంచమంతా ఉంది కాబట్టి ప్రతిభాషలోని కళ ప్రపంచమంతా అల్లుకొనిపోవడానికి ప్రయత్నముచేయాలి. అట్టి విశాల హృదయము కల్గిననాడు ఆ ఫిలుము బాగుంటుంది.

ఫిల్ముయొక్క బాగోగులను గురించి నిర్మాతలు విమర్శకుల మాటలు చెవినిబెట్టరు. దీనినిగురించి దేవికారాణి ఇట్లు చెప్పుచున్నది. "Generally criticisms are valuable in most cases thay are so just and helpful. In fact we have a special reader to interpret them and on their criticism we improve things for India is already filmminded" ఈపద్ధతిలో మన తెలుగుదేశము వెనుకపడియే యున్నది.

## క్లోజప్

ఇమిటేషను సంగీతాలనుగురించి చెప్పినదే చెప్పట అంతమంచిది కాదు. సాధ్యమైనంతవరకు ఎవరికి వారు సహజమైన స్వభావసిద్ధమైన సంగీతాన్ని ఉపయోగించుకోవాలి. కథ ఫిల్ముతోపాటు నెమ్మదిగా నడుస్తూఉంటుంది. అక్కడక్కడ ఆహ్లాదమునకుగాను మధురమైన సంగీతము కావలసినదే. అది Under Current వలె నుండవలెగాని ఇష్టమువచ్చినచోట విసరకూడదు. పాటకొరకు Situation ను చూపించవలసి ఉంటుంది. లేకపోతే పాట రక్తికట్టదు. Situation లేనిపాట, ఎంతమంచిదైనాసరే పాడగును. పాట, అభినయము, కెమెరాచలనము మిళితములై ఉండాలి. కొంతమంది పాటకొరకు క్లోసప్పులు తీస్తారు అనవసరముగా. దీనిలో అర్థముండదు.

## బాక్ గ్రౌండ్

నాటకాలలో నేపథ్యమున సంగీతము లేక పాట బాగుండుట లేదని తీసివేయుచున్నారుగాని సినీమాలలో అవి చాలా బాగుంటున్నాయి. Background Music కూడ ఉండవలసినదేగాని దానిని ఎట్లు ఉపయోగింపవలెను అను సంగతి తీసేవారు చూచేవారిని అడిగి తీయవలసి ఉంటుంది. మొత్తమునీద మంచివనుకొనే తెలుగు ఫిల్ములలో మంచిపాట వెనుకవంత సంగీతములో కలిసిపోయి ఒక్కటే గోలగా ఉంటుంది. జాగ్రత్తగా పరిశీలిస్తే తెలుస్తుంది. Team Music మనకులేదు. ఇటీవల విదేశాలనుంచి దిగుమతి అయింది. అది బాగానే ఉంటోంది. Unexpected లో వంతపాటతీసి గ్రామఫోనుకు Situation కల్పించి పాడించారు. ఇది క్రొత్త ఉద్దేశ్యమే. Merry Widow అనే ఫిల్ములో ఒకడు ఒక ఇంటిలోనికి పోవుటకై వాకిట నిలచినాడు. ఇంటిలో సంగీతము వినుపించుచున్నది. తలుపు తెరచినవెంటనే అచ్చట కొంతమంది కార్మికులు పనిచేసుకుంటున్నారు. వారువారు చేసికొనే పనులవలన వచ్చే శబ్దము సంగీతము వలె వినుపించుచున్నది. నిర్దేశకుని చాతుర్యము నేమనవచ్చు!



## ఇమిటేషన్

భారతీయసంగీతాన్ని విదేశీయులే ఒప్పుకున్నారు. 'Indian melody is cast in one definite mood throughout and both time and tune are wrought into one homogeneous whole' అన్నారు. అయినప్పటికి వారు మనల ననుకరించరు. ఇక మనమో – అరవవారు తెలుగువారిని, తెలుగువారు మరాఠీవారిని, వారు హిందూస్థానీవారిని, వారు బెంగాలీవారిని, వారు ఇంగ్లీషువారిని, ఇంగ్లీషువారు ఫ్రెంచివారిని, ఫ్రెంచివారు ఇటలీవారిని అనుకరిస్తారు. ఇమిటేషన్ రాగాలు వినేటప్పుడు చూచేవారు ఎంత విసుక్కుంటున్నారో తీసేవారు గ్రహించాలి. వందేమాతరములో నాగయ్యగారి సంగీతాన్నిగురించి బళ్లారి రాఘవాచారి గారు జమీన్ రైతులో వ్రాస్తూ చాలావిచారపడ్డారు. తుదకు 'ఇదే మనవారి ఉద్దేశ్యమైతే నామట్టుకు నాకు పౌరాణికగాథలే చూడాలని ఉన్న'దన్నారు. చాలదూ! డైలాగుపాటలు చాలాకాలము క్రిందట మూల పడిపోయినాయిగాని హిందూస్థానీవారి ధర్మమువలన మళ్ళా వచ్చినాయి. చాలా! అస ఉంటాయి వింటానికి. [ఇం

## ‘ధూమపానము తరతరాలనుంచీ వస్తున్నటువంటి పాత ఆచారము.’

# పొగాకమ్మ పొకీళ్లు

పొగాకు పుట్టుపూర్వోత్తరాలు.
పొగాకమ్మ సేవకులైన పాశ్చాత్యులు.
జిన్నా, సప్రూ, నైజాం పొగత్రాగడంలో ప్రసిద్ధులు.
పొగపీల్చినంతమాత్రంచేత ఆయువుతరగదు.
నేడు చుట్టముట్టని సుప్రసిద్ధులున్నూ వున్నారు.

రచయిత:
ముద్దా విశ్వనాథము

ధూమపానం-తరతరాలనుంచీ, యుగయుగాలనుంచీ వస్తున్నటువంటి ఒకఆచారం. ఈ అలవాటు అమెరికాలోను, వెస్ట్ఇన్డీస్‌లోను — అబ్బో! ... అతి ప్రాచీన కాలంనుంచీ పాదుకొనిపోయివున్నది.

1492 లో కొలంబసు, వెస్ట్ ఇన్డీస్ దీవులు—బహామాస్, క్యూబా, హైతీలను కనిపెట్టాడు. ‘క్యూబా’లో ఒక ఎర్రటిమనిషి పొగాకుచుట్టకాల్చి ధుమాగా—మేఘమండలంవలె—పొగి కెరటాలను వదలడం కొలంబసు గమనించాడు. ఆతడు-ఆ యెర్రటి రంగు మనిషి-కాల్చే దానిపేరు‘టొబేగో’. దాన్నే మనం యిప్పుడు ‘సిగర్’ లేక పొగచుట్ట అని అంటున్నాం.

తొలుతగా ఇంగ్లండుదేశంలోకి పొగాకు 16-వ శతాబ్దపు ఉత్తరార్థంలో ప్రవేశపెట్టబడింది. ఈ పొగాకును 1568 లో సీమకు తెచ్చిపెట్టిన ప్రముఖుడిపేరు-సర్ జాన్ హాకిన్స్. ఇతడు ఎలిజబెతురాణి కాలంలో ‘సీ-కప్తాను’. అయితే, ’గాకును తొలుతగా తెచ్చిన ’వం 1585 ప్రాంతంలో దీన్ని ప్రవేశపెట్టిన ‘సర్ వాల్టర్ రేలై’కు చెందాలెనని మరికొందరి వాదన.

యూరప్ అంతటిలోనూ బహుళంగా పొగాకు అలవాటు మొట్టమొదటిసారి అలుముకోవటం ఫ్రాన్సు జర్మనీల మధ్యను పొసగిన 30-ఏళ్ల మహాసంగ్రామ సమయమందు.

నెపోలియన్ యుద్ధాలతో బ్రిటన్ దేశమందు పొగతాగుడు బాగా వ్యాపించింది. ఇక గత యూరపియన్‌యుద్ధంతో స్త్రీ, పురుషవిచక్షణ లేకుండా పొగ సంప్రదాయం బాగా విస్తరించింది.

* * *

“హాఫ్‌వుడ్సా బ్లాడెట్” అనే పత్రిక ఇచ్చిన వివరాల్నిబట్టి, హెచ్చుగా పొగతాగే ఆసాములు అమెరికాసంయుక్త రాష్ట్రాలలోనివారు. వారు సాలీనా తలకొకంటికి 1,045 సిగరెట్లు పీలుస్తారు.

తరవాత, దాని సమీపానికి రాగల అర్హత బ్రిటను దేశానికున్నది. బ్రిటన్ జనాభాలో ప్రతివొకరూ ఏడాదికి 946 సిగరెట్లు చొప్పున తగలేస్తున్నారు.

మూడోస్థానం మెక్సికో, నాల్గవది బెల్జియమ్, ఐదవది ఫ్రాన్సు—ఇక్కడి సిగరెట్లు కర్చుసంఖ్య మనిషి ఒక్కంటికి 436-వరసగా ఆక్రమించుకొంటున్నవి.

* * *

భారతదేశంలో-ఎన్నడో ఏడవ శతాబ్దంలోనే - పరిమళమిళితమైన చుట్టలను కాల్చేవారు. పోర్చుగీస్ వారు కొత్తరకంపొగాకును గోవాకును, పశ్చిమతీరాన్నవున్న తదితర స్థలాలకున్నూ తెచ్చుటతో 1676 సంవత్సరంనాటికి భారతదేశంలో పొగాకుకు హెచ్చుగిరాకీ కల్గింది.

ఈనాడు, మనం-భారతీయులం-సగటున కాల్చిపారవేస్తున్న చుట్టలెన్నో తెలుసునా? ఏడాదికి 76,00,00,00,000. అనగా మనిషిఒకింటికి సుమారు ఇరవై అన్న

మాట! ముఖ్యంగా సింధురాష్ట్రంలో మరీ యెక్కువ. వారి సంఖ్య తలకి 54 సిగరెట్లు! విన్నారా?—

సిగరెట్ల మరొక స్వరూపం-బీడీలు. సిగరెట్లకంటె మనదేశంలో ఇవి అధికంగా కర్చుపడుతున్నవి. లెక్కల్నిబట్టి మన హిందూదేశంలో తల వొకింటికి సాలీనా బీడీలకర్చు 197 అని తేలింది.

మరి వొచ్చీ సింధు, బరోడా, మైసూరు, నైజాం రాష్ట్రాలలో'ని బీడీలకర్చు తలకి 500 సుమండీ!

పొగతాగటంమాట అటుంచి-మనదేశంలో పొగాకు మరి అనేక ఇతర రూపములలో వినియోగపడుతున్నది. వాటిల్లో మచ్చుకి కొన్ని-జర్దా, కిమామ్, డొక్టా, గుండీ. వీటిలో చాలామటుకి తాంబూల సేవనతో మిశ్రమంగా వాడబడుతున్నవి.

భారతదేశంలో సాలీనా పొగాకుకర్చు మొత్తం 1000 మిలియన్ల పౌన్లు. భారతదేశం-తనే ఎంతో పొగాకును స్వంతంగా పండించుకుంటున్నప్పటికీ, పైగా యూరప్, యునైటెడ్ స్టేట్స్‌నించి దిగుమతి చేసికుని ఎంతో పొగాకును అరగిస్తున్నది!

* * *

సుప్రసిద్ధకవిపుంగవులలో కొందరు జోరుగా పొగపట్టేవారున్నారు. దాని మహిమవల్ల కలిగే ఆవేశ, ఉత్సాహాలవల్లనే వారికలం నుండి మహత్తరరచనలు వెలువడ్డవని చెప్పవచ్చు.

చార్లస్ లాంబ్-వ్రాయడానికి కూచునేముందు ఒక్క సిగరెట్ పీల్చి పారవేయడం అలవాటు. సర్ జేమ్స్ బారీ—పైపులో పొగాకు దట్టించుకునిగాని, వ్రాతకు కూచోడు. ఒడలు పులకరింపజేయగల రచనలు సాగించే ఆ సుప్రసిద్ధుడు-ఎడ్గార్ వాలస్‌కు ఎప్పుడూ నోట్లో పొగవుండాలి. ఒకపొడవుపాటి నల్లగొట్టం ఆయన వ్రాత సాగించినంతసేపూ పెదవులమధ్య వుండి తీరవలసిందే.

ఎప్పటి మాటో యెందుకు?—ఈనాడు మనం ఎరిగివున్న ఇంగ్లీషు రాజకీయదురంధరుల సంగతి చూదాం : చుట్ట నోటలేనిదీ చర్చిల్‌నూ, పైపులేనిదీ బాల్డ్విన్నూ మీరు చూడనే చూడలేరు!

ఒకప్పుడు తన పొగ అలవాటుని గురించి చర్చిల్, తానే ఇలాచెప్పుకొని వున్నాడు—"నేను చిన్ననాటినుంచీ నా 'నికోటిన్' (పొగాకులో ఇమిడివుండే విషం) దేవతను ప్రమాణపూర్వకంగా విసర్జించి వుంటే నా కింతటి మధురతత్వమూ, ఇటువంటి స్నేహపాత్రత అమరివుండునని నే నెలా చెప్పగలను ?"

బాల్డ్విను, తన పైప్‌తోడి ఎడబాటును ఒక్క చిటికసేపైనా తాళలేడు ! ఉంటే నోటిలోను, లేదా చేతిలోనైనా పైపు ఉండి తీరవలసిందే.

ఫ్రాన్సును పాలించిన మూడవ నెపోలియన్ చక్రవర్తి ఎన్నదగిన పొగతాగుడుగాడు. అతడు జాగ్రదవస్థలో-నిద్ర నామమాత్రంగానే వుండేదిలెండి - వున్నంతసేపూ పెదవులనడుమ సిగరెట్ తాండవించవలసిందే!

ఆల్బేనియా పూర్వపు రాజు-జాగ్‌రాజు- నోరెప్పుడూ అగ్గిఆరని కార్ఖానా అనుకోండి! సిగరెటు అయిపోయిందీ అంటే మళ్లీ అలా ముట్టించుతూనే వుంటాడు. ఈతన్ని గురించి ఒకప్పుడు డోల్ఫస్ ప్రసంగిస్తూ "పొగతాగుడు ప్రభువు" అనే బిరుదు ప్రసాదించాడు. ఇది ఆయనకి నిజంగా తగినబిరుదే అనడానికి సందేహంలేదు.

ప్రెసిడెంటు రూజువెల్టు కూడా దిట్టంగా పొగపీలుస్తాడు. ఒక విధమైన రాతితో తయారయిన పొడుగాటి పైపువంటిది వాటంగా ఒక కోణంలో సదా పెదవుల్ని అంటిపెట్టుకుని వాలివుంటుంది.

మన సార్వభౌములు, వారి సోదరులందరూ పైపు పీలుస్తారు.

* * *

ఇక, మన భారతీయ ప్రముఖులలో జిన్నా, సర్ తేజ్‌బహదూర్ సప్రూ—ఈ యిద్దరూ పొగపట్టడంలో ప్రధానులు. జిన్నాకు సిగరెట్లు మాత్రమే కావాలి. పోతే, సప్రూ-వివిధస్వరూపాల్లో పొగాకు సేవన చేయగలడు.

అలహాబాదులో, తన గదిలో కూర్చుని సప్రూ-ముందుగా పైప్ ప్రారంభిస్తాడు. తరవాత పొగచుట్టుపిమ్మట సిగరెట్లు, తదన

హూకా, చివరకు మళ్లీ మొదటికి వస్తాడు-అనగా పైపు నోట బెడతాడు! ఇవన్నీ చాలనట్టుగా, మధ్య మధ్య తాంబూలంలో పొగాకు వేసి బుగ్గను పెట్టుకుంటాడు!!

ఒకసారి సప్రూ "నేను నిత్యాగ్నిహోత్రుణ్ని" అని చెప్పుకొన్నాడు. ఈ పలుకులో చాలా అంతరార్థమున్నది. దాని కథ ఏమిటీ అంటే—

రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సుకు గాను సప్రూ లండను వెళ్లినప్పట్లో ఒకనాటిరాత్రి ఒక జర్నలిస్టు టెలిఫోనులో - మా ఇండియన్ ఆఫీసువారు తమకొక అధిపత్యం యిస్తూ కేబుల్ చేశారని చెప్పాడు.

"ఏమిటది?" అన్నాడు సప్రూ.

"అయ్యా, తమకు ఏ బిరుదు అత్యంతప్రీతికరమైంది?" అని పత్రికావిలేఖరి ప్రశ్నించాడు.

"ఆఁ...అవును,— 'నిత్యాగ్నిహోత్రి'..." అంటూ సప్రూ రిసీవర్‌ను కింద పెట్టివేశాడు!

ప్రపంచంలోకల్లా హైదరాబాదు నవాబుఅంతటి శ్రీమంతుడు -వేలుమడిచి చెప్పటానికి-మరొకడులేడు. కాని ఆయన అతిరాలా నిరాడంబరజీవి. తిండీ, బట్ట-అన్నీ కూడ అతిసామాన్యంగా వుంటవి. వారు తమ వూళ్లో తయారయే "చార్మినార్", "గోల్కొండ" మార్కు సిగరెట్లుతో తృప్తిపడతారు. ఖరీదుగలవానికి పోరు.

* * *

పొగపీల్చినవారికి ఆయువు తరిగిపోతుందని కొందరి నమ్మిక. కాని, ఈ విశ్వాసానికి విరుద్ధంగా అమితంగా పొగత్రాగి, దీర్ఘకాలం జీవించినవారి కథనము లున్నవి. వింటారా?—

టామస్ విన్‌హార్ట్-డమ్‌ఫ్రీస్ నివాసి. అతడు 124 వత్సరాలు బ్రతికి, స్వర్గస్థుడైనాడు. అతడికి చిన్నప్పటినించీ పొగపీల్చడం, పొగాకు నమలడంకూడా బాగా అలవాటే.

వర్జీనియా దేశస్థుడయిన జాన్ డిలాస్మిట్ అపరిమితంగా పొగ తాగేవాడు. 130 ఏళ్లు చక్కగా జీవించాడు.

పొగతాగుటలో ఘనుడైన (డచ్చి) క్లీజ్ 80 వర్షములు గడిపాడు. తనజీవితంలో మొత్తం 40 టన్నుల పొగాకును ఉపయోగించినట్టు అతడు చెప్పాడు.

ధూమపానం మరిగిన శతాబ్దజీవులు స్త్రీలలో మరీయెక్కువ.

కాసిల్‌టవున్‌లో వుండే కేథరిన్ క్విన్నీసతి పూర్తిగా నూరేళ్లూ బతికింది. ఆమె వారానికి రెండు ఔన్సుల పొగాకుచొప్పున అరగించేది. స్కాట్‌లాండ్ (కూ్యపర్) లోని గ్రానీ 101-వ యేట స్వర్గస్థురాలయింది. ఆమె పైపుగొట్టం పీల్చేది, సిగరెట్లుకూడా కాల్చేది. డాక్టర్ డేవన్‌పోర్టు-అమెరికా లేడీ డాక్టరు-111 వత్సరాలు జీవించింది. ఆమె రోజుకి మూడేసిప్యాకెట్ల వూదిపారేసేది.

* * *

ఇక చుట్టముట్టని సుప్రసిద్ధులున్నూ ఉన్నారు.

జార్జి బెర్నార్డ్‌షా పొగపట్టడు. అలానే మోటారునిర్మాణచక్రవర్తి అయినటువంటి హెన్రీఫోర్డు కూడా పొగాకుకిట్టదు. "మానవుడు—పానీయములూ, పొగత్రాగుడూ విసర్జించితే పూర్తి నూటపాతికయేళ్లు బతకవచ్చు" నని ఆతడు చెప్పాడు. ఆతడి భోజనంలో మద్యసంబంధమైన వస్తువులేవీ కలియవు.

ముసోలినీ హిట్లర్లు ఉభయులూ మితాహారనియమం కలవారు. వారు మద్యాలనుముట్టరు, పొగ ససేమిరా పీల్చరు. ముసోలినీ ఇట్లా అన్నాడు—'మద్యపానం వ్యక్తులకేకాదు, సంఘంయొక్క ఆరోగ్యాన్నే శిథిలంచేస్తుంది. నామట్టుకి నేను శాకాహారిననే చెప్పగలను. మద్యం ఎన్నడూ నేను చవిచూచి యెరుగను. మహాసంగ్రామానంతరం పొగపీల్చుటకూడ మరచాను.'

హెర్ స్ట్రీక్కర్ అనే సుప్రసిద్ధ జర్మను సెలవిచ్చిన సుభాషితం ఇది—'నికోటిన్ మన జాతికి ముప్పు తెచ్చే విషం. జర్మన్‌జాతిని నాశనంచేసి, ఆర్థికలాభం పొందటానికని యూదులు మనకు పొగత్రాగుడు అలవాటుచేశారు.'

## ‘విరాగులు, యోగులు మొదలగువారికి ప్రేమరుచిచూపింది సిల్కు’

# సిల్కు చిద్విలాసం

పట్టును పుట్టించింది ఒక పడతి.
సిల్కువల్లనే అరిస్టాటిల్ వేదాంతి అయ్యాడు.
ఒకనాడు సిల్కు రాజోచిత వస్త్రం.
అయినా, కత్తిపట్టి రాజ్యాలు జయించిన
అలెగ్జాండర్ సిల్కు కట్టి స్త్రీని వశీక
రించుకోలేక పోయాడు.

రచయిత :
భమిడిపాటి వెంకటరమణయ్య

ప్రపంచమందు చిరకాలము నుండి వస్త్రములలో మొదటి స్థానం సిల్కుదే. సున్నితమైన, సుందరమైన, ఈ సిల్కు ధరించే వారికి ఆనందము, అందము కలిగిస్తుంది. ఆకారమునకు యిది ఒక అలంకారము. చూచువారి కనులకు ఆహ్లాదము కలిగిస్తుంది. సిల్కులో ‘రోమాన్సు’ కలిగించే శక్తివుంది.

సిల్కు ప్రపంచమందు గొప్ప ఉపయోగకారిగా పరిగణింపబడుతూంది. మహాసీయులను, వారియందుగల మహిమలను చూడగలిగింది సిల్కు అంటే యేమీ ఆశ్చర్యములేదు. పెక్కురు జీవనములలో ప్రత్యేకమార్పును కలిగించగలగింది సిల్కు. ఎడారులవంటి హృదయాల్లో అమృతంవర్షింపజేసింది సిల్కు. విరాగులు, యోగులు, మొదలగువారికి “ప్రేమ” రుచిచూపింది సిల్కు. మన ‘ఆదిమపురుషుని’ ‘అవ్వ’ యొక్క బానిసగ చేయగలిగింది ఈ సిల్కే.

## పట్టు ఉత్పత్తి

సిల్కునుగూర్చి అనేక వింత కథలు చెప్పబడ్డాయి. అంయితే ఈ ‘సిల్కు’ అనేపేరు ఏలా వచ్చింది? సిల్కువ్యుత్పత్తే ఓవింత. ఈ వింత వస్తువు మొట్టమొదట కనుక్కోబడినది వింతలకు స్థానమైన చైనా దేశంలో.

క్రీస్తుకు కొంతకాలమునకు పూర్వము, ఓ చైనారాజు భార్యలలో నొకామె, ‘బొంబక్సు మొరియా’ నుండి భోగలాలసుల శవపేటికలను దొంగలింప యత్నించేది. ఆమె అటులచేయుటలో వింతలేదని అంతా ఒప్పుకున్నారు. ఆమె పేరు సిలింగు. ఆమె యెల్లప్పుడు సున్నితమగు వాటినిగాని, సుందరరూపులనుగాని ప్రేమించేది. ఆమె కనుగొన్నదే ఈ సిల్కు. ఆమెకనుగొన్నది గావునే దానికాపేరు ‘సిల్కు’ అనివచ్చింది. ఆమెసిల్కుకు అధిదేవతగా పూజింపబడుతూంది. ఆమె వంశస్థులు ఉన్నన్నాళ్లు రాజమందిరమున కెదురుగ ఓ దేవాలయం నిర్మించి, ప్రతిసంవత్సరం ఆమెపేరిట వివిధకానుకలు చదివించేవారు. సిలింగు, సిల్కువిషయమై, చాలా శ్రమపడ్డాది. అనేక పరీక్షలు చేసింది. సిల్కు ఉత్పత్తికారకములైన ‘సిల్కుపురుగుల’ను వృద్ధి చేసింది. వాటి కాధారమగు ‘మలబర్రీ’ వృక్షములను పెంపొందించింది.

ఇది సిల్కుయొక్క ఉత్పత్తికి సంబంధించిన కథ. ఇక ఆవస్త్రము చేపర్పడ్డ వింతలు, అందుకు సంబంధించిన వింత కథలు ముచ్చటిద్దాం.

## సిల్కు వేదాంతం

‘ఫిలీన్’ అనే యువతి ధరించిన ‘సిల్కుదుస్తు’ ‘అరిస్టాటిల్’ అనే ఫిలాసఫర్‌లో ఒక గొప్ప మార్పు కలిగించింది. ఆమెను అతడు ప్రే

మించాడు. ఆమె చేయిగ్రహించేందుకు అనేకమైన పాట్లుపడ్డాడు.

అయితే ఈ 'ఆరిస్టాటిల్' ఎవరు?

బాలుడగు అలెగ్జాండరు యొక్క ఉపాధ్యాయుడు. ఇతడు తన శిష్యునకు, తను ప్రేమించిన యువతికి మధ్య కొంతవరకు ప్రేమానుబంధము గలదని తెలసి దాన్నినశింపజేశాడు. కాగా తనకు ఆశాభంగము కలిగించిన 'ఆరిస్టాటిల్' పైన ఆమె కక్షగట్టింది. పగసాధించేందుకు ఒకఉపాయం పన్నింది.

ఒకనాడు ఆమె తనవద్దగల దుస్తులన్నిటిలోను మిక్కిలి పలచనిదైన 'సిల్కుదుస్తు' ను ధరించింది. సర్వాంగశోభితయగు ఆమెకు ఆదుస్తు మరింత అందము చేకూర్చింది. సామాన్యంగా 'ఆరిస్టాటిల్' వుండే పూలవనానికివెళ్లి అక్కడ పువ్వులుకోస్తూంది. అతని రాక కెదురుచూస్తూంది. పూవులు కోయుచున్న ఆపూబోడిని చూచాడు అతడు. సన్ననిసిల్కుదుస్తుచే కప్పబడి, అన్నిఅంగములకు మరింత అందముకలిగించి గోచరింప చేయుచున్న ఆమెఆకారమునకు పరవశుడయిపోయాడు. అర్ధదిగంబరములగు ఆమె తొడలుపడ్తూ, 'నువ్వేమిచెప్పినా సరే సాధించి తీరుతాను, నిన్నేలాగైనా పరిణయమాడ్తా' నన్నాడు. ఆమెను తనవైపు మరలించుకునేందుకు 'నీ సిల్కుదుస్తు కళ్లెముగాయిస్తే నిన్ను వీపుపైన ఎక్కించుకొని వనమల్లా తిప్పుతా' అన్నాడు. ఆమెను ఆవిధంగా వీపుపై ఎక్కించుకోవచ్చుగదా అనే ఆనందంతో, ఆతడు పూర్తిగా అలసిపోయి, దీర్ఘముగా శ్వాసములు విడుస్తూవుంటే, ఆమె ఆతని వీపునుండిదిగి 'యిక నరకమునకు పో!' అని వెళ్లిపోయింది. ఈ సంఘటన తరువాతనే ఆరిస్టాటిల్ స్త్రీలు: జిత్తులు, మోసములు చేయగల సమర్ధతను గురించి అనేకపుస్తకాలు వ్రాశాడు. గొప్ప ఫిలాసఫర్ అయాడు.

'స్త్రీల మోసములనుండి తప్పుకోవాలంటే, ఆమెదగ్గఱనుండే తప్పుకోవాలి' అన్నాడు.



## సిల్కు నిషేధం

మొట్టమొదట క్రూసేడరులు- ధర్మవీరులు- ప్రాన్సు, తత్పరిసర యితరదేశాల యందు సిల్కును వ్యాపింపజేశారు. ధనికులు, రాజులు, పాలకులు, భోగాసక్తులు సిల్కును ఆదరించారు ప్రేమతో.

'ఫిలిప్‌పైరు', తను కొత్తగా పరిణయమాడిన కాంతను, సిల్కుదుస్తులచే అలంకరింపజేసి తన దేశమునకు తెచ్చాడు. ఆమె అంతటా అందరూ సిల్కునే ధరించి వుండడం చూసి 'సిల్కుధరించిన రాణిని నేనేనని మురిసాను, గాని అందరూ రాణులే' అంది. దానిపై రాజుగారు ఓతీర్మానంజేశారు 'ప్రత్యేక ధనికకుటుంబములు తప్పించి, యితరులు సిల్కును వాడగూడదు' అని.

ఒకటవ ప్రాన్సిసు పాలనములో అందరూ సిల్కునే ధరించేవారు. ఇంటివద్ద, యితర విషయములందుగూడ సిల్కే. మితిమీరిన ఈయుపయోగము అరికట్ట యత్నించాడు అతడు. తరువాత 'రెండవ ప్రాన్సిసు', 'రెండవ హెన్రీ' కాలములో, కొన్నినియమములు అమలుపరచారు. చాలావరకు మార్పుజేశారు.

ఈ సిల్కు వింతకథలలో 'నవేరా' రాణి చరిత్ర ప్రసిద్ధమైనది. 'మార్‌గ్రెటా వెలాయస్' ఆమె పేరు. ఆమెకు అనేకమంది ప్రియులు. అందరూ ఒకేమారు వరుసగా చనిపోయారు. (ప్రత్యేకరహస్యముందంటారు). ఆప్రియులందరిని ఆమె ఓవిధంగా జ్ఞాపకముంచుకుంది- సిల్కుతో 'పెట్టీకోటు'లను కుట్టించుకుంది, వాటికిచుట్టూ చిన్నచిన్న జేబులు వేయించింది. ప్రతియొక్క జేబులో తనగతించిన ప్రియుని- హృదయం దాచింది. అంటే అతని హృదయపరివర్తనకనుగుణ్యమగు చిహ్నము వేసుకుంది జేబులపైన.

ఎంతటిచక్కటి యుపయోగం!



## సిల్కు మేజోళ్లు

'నెపోలియను' పరిపాలనచేయు కాలములో, రాణియైన 'జోసెపైను' అనేకవిధములయిన ప్యాషనులు ప్రవేశపెట్టింది. ఆమెకాలములో పూర్వపురాజుల కాలము

కన్న 10 రెట్లు అధికముగా సిల్కు యూరప్‌కు పంపబడింది. 'నెపోలియను' తనభార్యదుస్తులు, వింత వింత ప్యాషన్లుచూచి ఆశ్చర్యపడేవాడు. ఒకమారు తనభార్య యింకో స్త్రీ సహాయమున మరియొక క్రొత్తఫ్యాషను కనిపెట్టుతూంది. అదిచూచి నెపోలియను, 'రాజకీయ ధురంధరునిభార్య ప్యాషనులకు ప్రథమురాలుకావాలని కోరుతున్నాను' అన్నాడు.

ఎలిజెబెత్తురాణి మొట్టమొదట సిల్కు మేజోళ్ళను ధరించింది. అంతకుపూర్వము గుడ్డలనే చుట్టుకునేవారుకాళ్ళకు. సిల్కుమేజోళ్ళను ధరించడం తగనిపనేకాని అవి ధరించాక తనకుకలిగిన ఆనందమునకు, మరియేయితర మేజోళ్ళను ధరింపనిచ్చలేదని అనేది ఆమె.



## పట్టు పనిచేయలేదు

మహాయోధుడు, గ్రీకుప్రభువగు అలెగ్జాండరుగూడ ఒకప్పుడు సిల్కుదుస్తులను ధరించేడు. అదిన్నీ ఒక స్త్రీహృదయం తనవైపుకు త్రిప్పుకునేందుకు అని వేరే చెప్పనక్కర లేదు.

పెరిషియను రాజగు 'డ్యారిసు'ను ఓడించి, ఆతనికుమార్తె 'స్టాటిరా'ను ఎత్తుకపోయి, తమ ప్రభువుకర్పించారు గ్రీకులు. అలెగ్జాండరు ఆమె అందమునకు చకితుడయ్యాడు. తనపాణిగ్రహణమునకు ఆమె అంగీకరిస్తే పూర్తిగా ఆ దేశానికి స్వాతంత్రం యిస్తానన్నాడు. తన హృదయరాణిగా, తన పట్టమహిషిగా చేసుకుంటానన్నాడు. కాని ఆమె అతనిప్రేమ కాలదన్నింది.

ఆమె అలా నిరాకరించడానికి కారణం, తాను ధరించిన యుద్ధపుదుస్తులు అలా వుండవచ్చునని తనరక్తమయదుస్తులచూచి తన్ను కిరాతునిగ తలంచినదనుకొని అలెగ్జాండరుదుస్తులను మార్చివేసాడు.

సేవకుల సహాయమున అభ్యంగనస్నానముచేసి, కళాశోభితమగు తన దేహమునకు సిల్కుదుస్తులు అలంకరించుకుని, వాసనద్రవ్యాలతోగూడికొన్న మేలురకపు దుస్తులతో, తను నిజమైన ప్రేమపిపాసినని తెలియచేయుటకు, ఆమెవద్దకు వెళ్లాడు. గాని ఆతనికి అదృష్టం తోడుపడలేదు. అతనివేషముచూచి ఆమె నవ్వింది. బాధిస్తే ప్రాణాలు విడుస్తానంది.

ఇటువంటి సమయాల్లో సిల్కు ఎట్టి ఉపయోగకారి కాజాలదు. 'దేశములు జయించిన వీరుడు తాను ప్రేమించిన స్త్రీహృదయం జయించలేక పోయాడు.'



## ప్రియులకు

ప్రియులు సిల్కుఅంటే ప్రత్యేకత చూపుతారు. ప్రేమపిపాసులు ఈసున్నితవస్త్రాన్నిధరిస్తారు. భగ్నప్రియులు తమప్రేయసినుల సిల్కురుమాళ్లు, లేసులు, జ్ఞాపకార్థం ప్రాణపదంగా కాపాడుకుంటారు.

కామమునకై పూజ్యుడగు పినతండ్రిని పొగొట్టుకునేందుకు

# షాక్ తగిలించాడు

[ చిన్న కథ ]

'ఇట్టి దారుణకృత్యానికి కారణమైన దాంపత్యమంటే హేమకు భీతికలిగింది. కాని కాలం తీసుకురాగల మార్పు నంతటినీ తీసుకువచ్చింది.'

రచయిత :

కొత్తపల్లి శ్రీరామమూర్తి, యల్.యం.ఇ.

౧

మోహనరావు దిగాలుపడి చతికలబడ్డాడు కుర్చీలో. సేలంపంచి కుచ్చిళ్లు చెడిపోయాయి అతడు కాలిమీద కాలువేసి మెలిపెట్టి కూచోడంవల్ల.

ఆచింతలోకూడా అతడు సిగరెట్టు విడవలేదు. ఆసిగరెట్టునుండి పొగ రింగురింగులుగా మేఘములవలె ఎగురుతోవుంది. ఆసమయంలో అతని ముఖముపై కనుపించు ముడతలు అతడు ఏదో గాఢంగా ఆలోచిస్తున్నాడని చెప్పకయే చెపుతూవుంది.

అతనిదృష్టి శూన్యమైన ఆ గదిలో ఒక చీకటిమూలపై లగ్నమైవుంది. అతని హృదయం ఆందోళనాపూరితమై కలవరపడుతూవుంది.

ఆమోహానుని గదికి ప్రక్కగదిలో, మోహన్‌రావు పెంపుడు తండ్రి నరసయ్య మంచంమీద పడుకుని వున్నాడు, రోగంతో మూలుగుతూ.

ఆతని ఒక్కొక్కమూలుగు మన మోహనరావుకి సూదిపోటులావుంది. ఆపాదమస్తకం అతనిని అసహ్యించుకొంటున్నాడు మోహానుడు.

అతని మూలుగువిని 'అయ్యో దేవుడా' అంటూ పళ్లు పటపట కొరికాడు మోహానుడు. 'నాదారి కడ్డురాకపోతే నాకింత కోపంఎందుకు వస్తుంది?'

ఆసమయంలో అతని మనస్సులో తలపులు మెరుపుతీగలాగున పరుగెత్తాయి. ఆఉదయాన వైద్యుడు చెప్పినమాటలు ఏదేనా చిన్న షాక్ తగిలితే అతని అసువులు అంతరించిపోతాయి, అని.

ఆమాటలు అతనిచెవిలో ప్రతిధ్వనిస్తూనే వున్నాయి. షాక్ షాక్ అని ఏదో గొణుక్కొన్నాగాడు మోహానుడు. అతని ఆలోచనాపరంపరలు ఒకానొక అవ్యక్త వ్యక్తి అడుగుల చప్పుడువల్ల అరికట్టబడ్డాయి. అవ్యక్తి మెల్లగా వచ్చి ద్వారమువద్ద నిలిచింది. తలుపుచప్పుడైంది. చటుక్కున అతని దృష్టి ఆనూతనవ్యక్తిమీదకు పోయింది.

౨

ఆవ్యక్తి దివ్యసుందరమైన స్త్రీవిగ్రహం. ఆమె అతని కనులకు విందుకలిగించింది. ఆమె ముఖంలో మందహాసం తొణికిసలాడుతూ వున్నది. ఆమెకళ్ళలో అపూర్వమైన వెలుగు కనుపిస్తోంది. ఆమె కోరచూపులతో మోహానునివైపు కొంటెతనంగా చూస్తోంది. అతడామెవైపు చూస్తూనేవున్నాడు. కాని అతని దుర్మార్గపు ఆలోచనవల్ల అతడు ఎదుటిఆమెను గుర్తింపలేకపోయాడు.

ఆమె 'మోహాన్!' అని అతిఅప్యాయంగా పిలిచింది. అమృదుమధురస్వరం అతనిచెవికి సోకుటతోడనే

చటాలున లేచి ఒక్కగంతు వేసాడు తలుపువద్దకు. మరుక్షణంలో హేమలతను– ఆమెపేరు హేమలత లెండి– అతని కౌగిటిలోకి లాక్కున్నాడు. చెట్టుని మెలివేసుకొనే తీగిలాగున పెనవేసుకుపోతుం దనుకున్నాడు మోహనుడు.

కాని ఆమె 'మోటమనిషివోయి, మోహన్! నీవు, నాచీరసాగసంతా చెరిపేశావు' అంటూ అతని కౌగిలినుండి తప్పించుకుని దూరంగానుంచుంది. అతడు నిరుత్సాహంతో కుర్చీలో కూలబడ్డాడు.

అతడు నిరాశతో కూలబడితే దగ్గరగావచ్చి 'మోహన్! మీఅక్కగారికి ఎట్లావుంది' అని అడిగింది హేమ, అతని బుగ్గలు సాగతీస్తూ మృదువుగా.

'ఇంకా ప్రమాదమేమి రాలేదు హేమా!' అని అతిశాంతంగా సమాధానంచెప్పాడు ఎదురుగుండా బల్లమీదవున్న ఫోనుపై దృష్టి నిలిపి మోహనుడు.

'అయితే వైద్యుడు ఏమన్నాడు' అని ఆతురతతో అడిగింది హేమలత తన రెండుచేతులు అతని భుజంమీద వేసి.

ఆమె రెండుచేతులు తన చేతులలోనికి తీసుకొని ఆమెవైపు ఏదో వికారంగాచూస్తూ 'కొంచెం షాక్ తగిలితేచాలు చచ్చిపోతాడు' అని చెప్పాడు వైద్యుడు. అలా అంటూ మోహనుడు వికటహాసం చేసాడు.

'ఆహా! ఎంత దురదృష్టవంతుడు' అని ఒక దీర్ఘమైన నిట్టూర్పు విడిచింది హేమలత.

మోహనునికళ్లు మెరుస్తూవున్నాయి. వాటిలో ఏదో రహస్యందోక్తకమాతూంది. 'నామాట విను. హేమా! అతడుఏమాత్రం బెదిరినా చావు తప్పదనిచెప్పాడు వైద్యుడు' అని అతిగంభీరంగా చెబుతున్నాడు మోహనుడు.

### 3

హేమలత తన చీర చెరగులు సర్దుకుంటోంది. ఆమెకు అతనిమాటలు అర్థంకాలేదు. అలా అనడంలో అతని ఉద్దేశ్యంఏమో ఆమెకు గోచరించడంలేదు. తన చీరమడతలమీదవున్న దృష్టిని ఒక్కసారి ఆ వికారస్వరూపుని ముఖం పైకి ప్రసరించింది. అతనిముఖంలో అతడేదో విషాదకరమగుపని తలపెట్టినట్టు ఆమెకు ఆసయంలో గోచరించింది. ఆమెకు అది ఏమిటో తెలుసు.

ఆ చెడుగును చెప్పటకు సంశయించి నాలిక కరచుకొంది. 'మోహన్! నీ యుద్దేశ్యమేమో నాకర్థంకావడం లేదు' అని ఎదో తడుముకుంటున్న దానివలె తన చూపును వేరుదిక్కుకు మార్చేసింది.

'కొంచెందానా! ఏమీలేదు ఏమాత్రం బెదురుపుట్టించే షాక్ ఐనా సరేచాలు, అతని ప్రాణాలు తీసేయగలవు. ఆ తరువాత...' అని ఏదో చెప్పబోయాడు.

చప్పున అతనికడ్డంవచ్చి గద్గదికస్వరంతో 'మోహన్, మోహన్, అదిమహాపాపం, మోహన్! పాపం, దయవుంచి అదారుణకృత్యం మాత్రం చేయకు' అని అతని రెండుచేతులూ పట్టుకుంది. ఆమెకళ్ళలో జాలికనుపిస్తోంది. ప్రాధేయపడుతూ అతని ముఖంవంకే చూస్తూవుంది.

నిశ్చేష్టురాలై నిలుచున్న హేమలతను తన మోటుచేతులతో హృదయమునకు అదుముకున్నాడు. అతడు ఒక చేతితో ఆమె వీపుపైన తట్టుతూ 'హేమా! నీవు పసిపిల్లవు. నీవే దీనికికారణము. అతడేగా మన సుఖస్వప్నములకు అంతరాయం కలిగిస్తున్నాడు. మన దారి కడ్డంపడే యీ కొండచెలవను తొలగించడం ముఖ్యంకాదా!' అని వికటంగా నవ్వుతూ అన్నాడు.

'కాని...అది' అని మాటలకై వెతుక్కోసాగింది హేమలత.

'హేమా! నామాటవిను మా తండ్రికి ధనంలేదు. అతడు కట్నములు యీయలేడు. మా అక్కగారికి డబ్బుఅంటేఆశ. కట్నంలేనిదే పుస్తె కట్టనీయడు. అందులోనూ పూర్వాచారపరాయణుడు. మనం వేరువేరు శాఖలకు చెందినవాళ్లం. శాఖాంతరవివాహం చేయడానికి అతను ఎంతమాత్రం ఒప్పుకోడు. ఈ ముసలిపీనుగులు మనమాటలు వినరు. కాబట్టి మన ప్రేమలతకు కుఠారమయ్యే యీ నరసయ్యను యీ లోకంనుంచి పంపివేస్తే మన పీడ వదలుతుంది. దానికి పెద్దప్రయత్నం అక్కరలేదు. ఒక్కచిన్న షాక్ చాలు, ఈ స్థితిలో మనపని నెర

వేయుతుంది. దాంతో నేను ధనవం తుడనవుతాను. మన యిష్టానికి ఆటంకంవుండదు. మీ తండ్రికూడా నా ధనంచూచి అంతశ్శాఖావివాహం చేయడానికి వెనుతీయడు' అని ముగించాడు వుపన్యాసం.

'మోహన్! వద్దు మోహన్! అట్టి దారుణకృత్యానికి నీ హృదయంలో తావియ్యకు. మనవివాహబంధమునకు అనుమతి యియ్యనంతమాత్రంచేత అతన్ని చంపతలచడం అమానుషంకాదా' అని అతిఆవేశంతో చెప్పింది.

'నాతత్వం నీకింకా అర్థంకాలేదు, హేమలతా! అతనంటే నాకు అపరిమితమైన అసహ్యాం. విషంలా చూస్తాను. అతనితో సహపంక్తిని భోజనంచేయడం, అతనితో మాట్లాడడం అంటే ఎంతో హేయంగా తలుస్తున్నా. ఇంత ఎందుకు? అతని కొంపలోవుండడమే నాకు యిష్టంలేదు. ఈవిషయమై అతనితో అనేకసారులు చెప్పాను. కక్కా! డబ్బుకి నేను లెక్కచేయననికూడా చెప్పా. కాని అతని హృదయం పాషాణం లాంటిది... నీవు ఏమిచెప్పినాసరే నీవులేకుండా నేను ఒక్కక్షణమైనా జీవించివుండలేను అన్నాడు.

అతడు ఆమాటల్ని చెబుతూన్నంతసేపూ అతని కళ్లలో నిప్పులూ నిరాశ తాండవమాడుతూవున్నాయి. తెలియకుండానే అతడు చేతులు నలుపుకుంటున్నాడు. అతని గుండెల్లో రైళ్లు పరుగు పెడుతూవున్నాయి. అతని కంఠస్వరంలో ఉద్రేకంచేత వణుకుబయలుదేరింది.

౪

హేమలత నిరుత్సాహురాలైంది. కాని ఆశారేఖ ఆమె హృదయమున మెఱసింది. 'మోహన్! అతనితో వాదించి నీ కోరికకు ఆమోదించేటట్లుచెయ్యి. అతడు మానవమాత్రుడు. నీకన్న అతనికి ఎవరున్నారు?అతడు అభిప్రాయంమార్చుకోవచ్చును. ఈ దారుణప్రయత్నం మాను' అంది ఆమె.

'సింహం తనగర్జన మార్చుకోగలదా? ఈ సరసయ్యగారు తన అభిప్రాయం మార్చుకోవడం అట్టిది అన్నాడు అతడు.'

ఈమాట ఆమెచెవులకు సోకినంతనే చటాలునలేచింది, చీరను ఒకసారి జాడించింది. 'చాలా చీకటిపడిపోయింది. అట్టే ఆందోళనపడి ప్రమాదంతీసుకురాకు. కాలమూర్తి అంతా చక్కబెట్టుతాడు. కాని నీవు ఏ దారుణకృత్యము చేయననిమాత్రం వాగ్దానంచెయ్యి' అని అతి మధురంగా వేడుకుంది ఆమె.

సిగరెట్టువెలిగించి ఒక ఊదు ఊది 'అలాగే, హేమా!' అన్నాడు.

హేమలత కష్టంమీద మోహనుని వదలిపెట్టి మెల్లగా ఆగదివీడిపోయింది.

౫

మోహనుడు ఆ కుర్చీమీద తల జేరవేసి ఒక పెద్దకఠినసమస్య ఆలోచించువానివలె ఆలోచనలో మునిగిపోయాడు. అశూన్యగృహంలో, మోహనుని పైశాచికకళ ఆవేశించింది. 'హేమలత పసిపిల్ల. దానికి నాపాటిజ్ఞానం ఎక్కడిది? బెదురుపుట్టించే చిన్నచప్పుడు— దానితో మా కక్కయ్య ఫయిసలా. ఇది చాలాసులభమైన విషయం' అని ఏదో గొణుక్కుంటూ వికటంగా వెకిలి నవ్వు నవ్వుకుంటూ కూచున్నాడు. పినతండ్రిని చంపుటకు నిశ్చయించుకున్నాడు.

వెంటనే, కాలుస్తూవున్న సిగరెట్టు క్రిందపడవేసి కాలితో నలిపేశాడు పగతీర్చుకుంటున్నట్టుగా.

దుష్టచింతలనుండి మనసును త్రిప్పడానికి ఎంతో ప్రయత్నించాడు. కాని ఏమీచేయలేక అట్లాగే మొద్దులా కుర్చీలో కూలబడివున్నాడు. అతని మనోనేత్రమునకు తన పినతండ్రి మంచంమీద మూలుగుతూ దొర్లుతూవున్న దృశ్యము ప్రత్యక్షమైంది. 'నేను అతనిని చంపితే ఎవరికి తెలుస్తుంది? నన్నడిగేవారెవరు ఎందుకుచంపావని? నేను మెల్లగా అతనిగదిలోకిపోయి గభీమని పెద్దచప్పుడు చేస్తేచాలు. ఆ ధ్వనికి అదిరిపడి అతనిలోని చిలక లేచిపోతుంది. అతనిని చంపాలంటే చంపగలను. అతనిప్రాణాలు నాపిడికిటిలోవున్నవి యిప్పుడు' అని వికట

టంగా కులికాడు. తనలో తాను వితర్కించుకున్నాడు.

అతనిని చంపడం చాలాసులభం అనుకుంటూ యింకోసిగరెట్టు వెలిగించి గుప్పు గుప్పున వూదుతూ ఆ గదిలో అటు యిటు తిరుగుతున్నాడు, ఉద్రేకంతో కంగారు మృగం లాగ. సిగరెట్టు వెలుగుతుండగానే పిచ్చిగా అగ్గిపుల్లలు వెలిగిస్తూనే వున్నాడు మనస్సు స్థిమతంలేక.

'అతనిని చంపడమా' విడిచిపెట్టడమా' అనేదే అతడు ఆలోచించే విషయం. దానినే తరచి తరచి ఆలోచిస్తూన్నాడు పళ్ళుబిగించి బుర్రగోక్కున్నాడు.

పెంచి పెద్దవానినిచేసిన పినతండ్రా? అందమైన సుందరి హేమా? యీ రెండింటిలోను దేనిని వరించుటో అతనికి ఏమీ తోచడంలేదు. వాటిని తరచి తరచి తుదకు సుఖమునేకోరాడు. పినతండ్రిపీడ వదల్చుకోడానికే అంతరంగమున నిశ్చయించుకున్నాడు.

ఎట్లా ఆ పని చేయడమో అని తత్తరపడ్డాడు. ఆహాడావిడిలో అతనికళ్లకు ఆగదిమూల ఒకబల్లమీద అతనిని వెక్కిరిస్తూవున్న ఒక గాజుకూజా కనుపించింది.

౬

వెంటనే ఆ కూజాను దొరకపుచ్చుకుని పినతండ్రి పడుకొనివున్న గదిగుమ్మంవద్దజేరాడు ఒక గంతులో. ఒకక్షణంఆగి తలపరికించి మెల్లగా గది తలుపుతోసాడు. ఆగది అంతా కళావిహీనంగావుంది. పిల్లిలాగ మెల్లగా బొటనవ్రేళ్ళమీద నడిచి మంచంసమీపానికి వెళ్లాడు. మంచంకేసి చూడగానే పినతండ్రి పాలిపోయినముఖం కనుపించింది. అతనిశరీరం అంతటా శాలువకప్పబడివుంది. కండ్లు అర్ధనిమీలితాలుగా వున్నాయి. నోరు తెరువబడివుంది. అతనిని ఆస్థితిలోచూస్తే ఎల్లాంటివానికైనా భయం పుట్టితీరుతుంది. భయంకరంగానేకాదు ఆ గది అంతా నిశ్శబ్దంగావుంది. ఒకమూల కనుకనుకు మంటో వున్నది హరికేను లాంతరు.

మోహనుడు యిదిఅంతా చూచాడు. ఒక దీర్ఘశ్వాస తీసుకున్నాడు. 'ఎవ్వరికీ తెలియదు' అనుకుంటూ ఆ కూజాను నేలనుపేసి కొట్టుటకు పైకియెత్తాడు చేయి. కళ్ళు మూసుకుందామని ప్రయత్నించాడు. కాని అతని దృష్టిని ఆకర్షించిందామంచంమీది పినతండ్రి శరీరం.

వొక అర్ధనిముషంలో విద్యుల్లతలాగు వొక కాంతిపుంజము అతనిశరీరంలో పాకినది. చప్పున అతని బాల్యావస్థ అతనికండ్లకు కట్టినట్లైంది. బాల్యంలో తాను అతని వడిలోకూచుని మీసాలులాగడం,

అతడు తనబుగ్గలు చిదిపి ముద్దుపెట్టుకోడం ప్రవాహంలా ప్రవహించింది అతని మెదడులో. అన్నిటికన్నా అతను తన్నువీపున ఎక్కించుకుని గుర్రంలాగ ఎగిరినవిషయం మరీ అతనిహృదయమును వూపేసింది. దానితో అతనిహృదయం నవనీతంలాగ మారిపోయింది. రెండు వేడికన్నీటిబొట్లు రాలాయి. తాను తలపెట్టిన దారుణకృత్యానికి పశ్చాత్తాపబడ్డాడు. పైకిఎత్తిన చేయివణుకుతో క్రిందికి జారిపోయింది.

౨

అతనిబుద్ధి మారిపోయింది. 'నేను నా ప్రేమమూర్తి తండ్రికి కించత్తైనా హానిచేయను' అనుకున్నాడు. వెనక్కితిరిగి పోబోయాడు. కాని నరాలు దుడుకుగాకొట్టుకునే ఆ కంగారులో కాలుజారింది ఆనున్నటి గచ్చుమీద. అతడు జారడంతో చేతిలోనున్న గాజుసూజా క్రిందపడి పప్పుపప్పైంది. మోహానుడు చప్పన లేచి కుంటుకుంటూ బయటికిపోయి భయంతో చూడసాగాడు.

'షాక్! షాక్! అయ్యో తండ్రీ! చనిపోయావా ఏమి?' అని కంగారుగా తనకితానే ప్రశ్నించుకోసాగాడు పిచ్చిగా. ఆగాజుముక్కలుచూస్తే మోహానునికే భయంవేసింది. కాని వాటినిచప్పున పోగుచేసి మంచంక్రిందకి తోసేశాడు. చప్పున తనగదిలోకి పరుగెత్తాడు. అతనిముఖంమీద కత్తివేసినా నెత్తురుచుక్క కనుపించలేదు, ఆసమయమందు. ఆపాలిన ముఖంతో అతడు కుర్చీలో కూలబడ్డాడు.

౩

'కూనీ' అని హేమలత చెప్పిన మాటనిజమే. అక్షరాలా నిజమైంది. ముందుగా ఆమెకు తెలియజేయాలి ఈ దారుణవార్త అనుకుంటూ ఆవణికేచేత్తోనే ఫోనుతీసి క్వీన్ మేరీకాలేజి హస్టల్ వార్డెన్‌కు ఫోనుచేసాడు హేమలతను పిలవమని. అతని కంగారుచూచి వార్డెన్ వెంటనే హేమలతను పిలిచింది.

మరుక్షణంలో మోహానుని హృదయాధిదేవత అతనితో ముచ్చటింప మొదలుపెట్టింది. 'హేమా! నిన్ను వెంటనే చూడాలనివుంది' అని సత్తిగా మాట్లాడాడు. ఆ ఆందోళనలో మరుమాటలేదు. ఫోనుపెట్టేశాడు, యింక ఏమిమాట్లాడ్డానికి తోచక.

అతని హృదయంలో గాలిదుమారం రేగింది. 'నేనెందుకీ దారుణం తలపెట్టాలి? ఎందుకు చేయాలి? కూనీ! కూనీ!' అని విచారిస్తున్నాడు.

గుండెలు కవుక్కుమంటూ ఆగదిలోకి పరుగెత్తుకొచ్చింది హేమలత.

మాటలు తడబడుతూ వుండగా 'ఎందుకింత హడావిడి' అని ఆమెను ఎదురుకొని స్వాగతం ఈయబోయాడు మోహాన్. రెండుచేతుల

తో తన తలకాయ పట్టుకొని 'ఏమిటి, నీ బాధకు కారణం?' అంది హేమలత.

'నా పినతండ్రిని మింగేశాను, హేమా' అని ముఖం బల్లనేసి కొట్టుకున్నాడు.

'చనిపోయాడా? వైద్యునికి కబురుపంపావా' అని దడచేత నిలువలేక బల్లకి జేరబడింది ఆమె.

మోహనుడు తల పంకించాడు. 'నీవుచేయకపోతే చెప్పు. నేనుచేస్తా' అని ఆదుర్దాగా ఆఫోనుతీసింది. అతడు నిరుత్తరుడు కావడంచేత ఎందుకేనా మంచిదని ఫోనుచేసింది.

వారిద్దరూ ఆరోగివున్న గదిలోకి పోయారు. ఆనిర్జీవప్రతిమను తదేకదృష్టిగా చూశారు. హేమ వంగి శరీరం తాకిచూసింది. కాలుచేతులు చల్లగావున్నాయి. నుదురు హిమంలాగుంది. తెల్లని శాలువా పూర్తిగా కప్పి వొక నిట్టూర్పు విడిచింది.

'నా తండ్రీ!' అంటూ బావురుమన్నాడు మోహనుడు.

హేమలత నిబ్బరంగా నిలబడింది. ఆమెకళ్లలో భయం, కోపం మిళితమైనట్టు గోచరిస్తూ వున్నాయి. ఆమె ఆశ్చర్యంతో నోరు నొక్కుకుంటూ 'ఓరి, పాపి! ఎంత పని చేశావంటూ' ఆ గాజు ముక్కలకేసి చూడసాగింది.

౯

అతడు ఆమె తీక్ష్ణవీక్షణాలకు తాళలేకపోయాడు, 'హేమా! నేను చేయాలనుకోలేదు. కాని విధి నిర్ణీతం యిలావుంది. నేను జారిపడ్డాను-' అని ఏమో జాలిగా చెప్పబోయాడు. కాని వాకిట అడుగుల చప్పుడు వినబడింది.

డాక్టరు రామారావువచ్చాడు- మంచంమీదవున్న దేహాన్నిచూసి తలపూపేశాడు- 'నేనుఅనుకుంటునే వున్నాను- పాపం- ఎంతబాధపడ్డాడో! ఎంతసేపైంది ప్రాణం పోయి? మోహన్!' అని వారివంకచూశాడు రామారావు, విచారంతో ఆశవంపైపుచూస్తూ. 'చెప్పలేనండి' అన్నాడు మోహన్,

వెంటనే రామారావు ఆ శవముపై కప్పిన శాలువతొలగించి తాకిచూసి మరల శాలువ కప్పివేసాడు- 'పాపం! ఐదారుగంటలకు పూర్వం యీలోకంనుండి పోయివుంటా' డన్నాడు-

ప్రేమకైకాదు కామమునకై పూజ్యుడగు పినతండ్రిని పోగొట్టుకొన్నందుకు ఆమోహనుని విచారానికి అంతులేదు-

ఇట్టి దారుణకృత్యానికి కారణమైన ఆదాంపత్యమున్న మొదట్లో హేమకు భీతికలిగింది- కాని కాలం తీసుకురాగల మార్పునంతటినీ తీసుకువచ్చి దానినిఅంతనూ మరపింపజేసింది.

వారిదాంపత్య ప్రథమఫలంగా వొకపుత్రుడుపుట్టాడు - అతడే అపరనరసయ్యగారి అవతారం అని లోకులమాట-

## తిరిగి స్వాతంత్ర్యాన్ని సంపాదించడానికి జెక్ యువకుల విశేషప్రయత్నం

# జెక్కుల ఆందోళన

“జెక్ జాతి తరతరాలుగా పరదేశీయుల పాలనలో ఎంత ఓర్మి కలిగివుండాలో నేర్చుకొన్నది. కావున నేడు జెక్ జాతి శాంతముగా, గంభీరముగా, ఓర్పుతో జర్మన్‌ల రాక్షస కృత్యములను ప్రతిఘటిస్తూవుంది.”

గత సంవత్సరము అక్టోబరుమాసంలో జర్మన్‌లు చెకోస్లావాకియాలోని సూడెటన్ భాగమును వశపరచుకున్నారు. నాటినుండి నేటివరకు చెక్ జర్మన్ జాతుల సామరస్యాన్ని దోహదము చేయు పద్ధతులను జర్మనీ అవలంబించియున్నచో చాలా బాగావుండేది. కాని జర్మనీకి చెక్ జాతిపై ఎట్టిగౌరవాభిమానములు లేవు. దానికి తోడు మ్యూనిక్ ఒడంబడిక జర్మనీని మరింత బలపరచింది.

సరిహద్దుల విషయములోను, చెక్ శరణాగతుల విషయములోను జర్మన్‌లు అతిక్రూరముగాను, పశుప్రాయముగాను ప్రవర్తించారు. తాను ఏనిశ్చయముపై సూడెటన్ లాండును ఆక్రమించిందో ఆ నిశ్చయమునే అపరిమితసంఖ్యాకులైన చెక్ ప్రజలుకల ఛోడ్ జిల్లాను, పరిసరగ్రామాలను మోటుతనముగా జర్మనీ కబళించింది.

జర్మనీ చెకోస్లావాకియా రాజధానియగు ప్రేగ్ నగరమును ఆక్రమించిన వెనుక సూడెటన్ జర్మనుల ప్రవర్తన మరింత మితిమీరింది. దానితో చెక్ జర్మన్‌ల మధ్యవుండు సుహృదయత కాస్తా నశించింది.

చెక్ జర్మనుల మధ్య సద్భావం శూన్యమగుటకు కారణము ఈ సూడెటనుజర్మనులే. ఈ చేటపెయ్య ఈనాటిదికాదు. వీమర్ రిపబ్లిక్ నకు చెక్కులకు అన్యోన్యతను చెరిపినది సూడెటన్ జర్మనులే.

వారే తిరిగి నేడు ఆ చెక్ స్వాతంత్ర్యమునకు భగ్నకారకులైనారు. చెక్ ప్రజలకు, వారి భావిభాగ్యము రీచ్ ప్రతినిధులమీదనే ఆధారపడివుందని వీరు ప్రబోధించినను వారు ఆప్రతినిధులను చూచుట మానుకొనిరి.

నేడు, స్వాతంత్ర్యప్రియులగు చెక్ దృక్పథమున కనుపించేదల్లా తమ పూర్వపురుషులు చేసిన ఘనకార్యముల ఉన్నతాశయములు ఈ జర్మనుల చేతిలో తారుమారగుటయే.

ఇప్పుడు జెక్‌లాండులో ప్రజాప్రభుత్వము నశించినది. మునిసిపల్ సంఘములందుకూడా అధిక సంఖ్యాకుల మాట చెలామణీ అగుట లేదు. వారివంతు పన్ను చెల్లించుటే గాని ఖర్చుచేయుట స్వల్పసంఖ్యాకులగు జర్మనులచేతిలో చిక్కినది.

మొదట జర్మన్‌నియంత చెక్ ప్రజల సాంఘికసారస్వతాభివృద్ధికి ఎట్టి నిరోధము కల్పింపనని వాగ్దానముచేసినాడు. కాని అది నేడు నీటిలోనిమూట అయినది. నేడు ఈ దీనస్థితిలో చెక్కులుకోరునది విజ్ఞానసంబంధమైన స్వేచ్ఛ. అట్టియెడ అల్పసంఖ్యాకులైన జర్మనులున్న గ్రామములందుకూడా చెక్కువీరుల విగ్రహములుగాని, ఆరాధనమందిరములుగాని వుండకూడదనీ; చెక్ వారిపేరులతో పరగే వీధులపేళ్లుకూడా నేటి జర్మన్ నాయకుల పేళ్లుగానో, లేక పూర్వపు హాప్సుబర్గురాజుల పేళ్లుగానో మార్చవలసినదనీ నిర్భంధించుచున్నారు. ఎంత దారుణము!

చెక్ నగరములందలి జర్మన్‌ల వైఖరి పరిశీలించినచో జర్మన్ జాతీయనాయకులు జర్మనీ చెక్కు జాతులనడుమ అన్యోన్యతను ప్రోత్సహించుటకు బదులుగా తమ పాత

పగలను తీర్చుకొనుటకు ఉసారుయిచ్చుచున్నట్లు కనుపించుచున్నది. ఇంతేకాదు జర్మనులు చెక్ జాతిలోని ఫాసిస్టులకు యిచ్చే ప్రోత్సాహము చూస్తూవుంటే చెక్ జాతీయులకు దుఃఖము కలుగుతూవుంది.

ఈమధ్య ఈ బాధలకు లోనైన చెక్ యువకులు బొహీమియా, మొరేవియా ప్రాంతముల వారందరుకలిసి, సమావేశమై ఒక కరపత్రము నొకదానిని ప్రకటించారు:

ఇప్పుడు బొహీమియా మొరేవియాలు జర్మనీరక్షణక్రిందవున్నవి. ఆపత్రము చెకోస్లావేకియా యువకుల కందరకు అందునట్లు రహస్య ప్రచారముసాగించిరి. అందులోని హాంసములను కొన్ని ఈ క్రింద వివరిస్తాను.



"ఓ, చెక్ జాతియువకుడా!

ప్రస్తుతములో నీకు అధికారముకాని స్వాతంత్ర్యముకాని లేదని తెలుసుకొనుము.

చరిత్రలో విచిత్రకాలముగా ముద్రింపబడు ఈ కాలమందు అతి జాగరూకులుగా నుండునట్లు యువకులను, బాలబాలికలను ప్రబోధింపుము.

శత్రువుని ప్రవర్తన శ్రద్ధతో కనిపెట్టుము.

జర్మనులుచేసే ఆర్భాటములను గమనించినట్లే కనుపించవద్దు. వారిని మరచిపొమ్ము. వారిని కలసికొన్నను ఎక్కువగా ఆదరింప అవసరము లేదు. ఎంతవరకు అవసరమో అంతే ఆదరింపుము. కాని వారు చేయుకుట్రలను వాటిని వీలైనచో ఫోటోలతోసహా ప్రజలకు తెలియజేయుము. మనజాతి ద్రోహులను ఒకకంటితో గమనించుచుండుము.

హాస్యముతోను, సంప్రతింపులతోను, తుదకు ఆటపాటలతోను మనోబలమును వృద్ధి చేసుకొనుము. ఆత్మశక్తిని నమ్ముము. చరిత్రలోని తప్పుడుపంక్తులను దిద్దివేయుము. నీ వీరత్వము ప్రదర్శింపుము. జ్యోతిర్మయమగు పూర్వచరిత్ర స్మృతికి తెచ్చుకొనుము. వారుచేసిన ద్రోహాలు, దౌర్జన్యాలు జ్ఞప్తియందుంచుకొనుము. తుదకు వారు పొందిన అవమానకరమగు అపజయమును మాత్రము మరచిపోకు.

నీ వ్యూహాలను పెంపొందించి, నీకు నియమములను నేర్పి ప్రోత్సాహమిచ్చు సారస్వతమును చదివి జీర్ణముచేసుకొనుము. వీరగాథలను ఉద్వేగముతో చదువుము.

సభలయందు, సమావేశములందు విజ్ఞానవిషయములను, ఆరోగ్య విషయములను, ఆర్థిక విషయములనుగూర్చి ఉపన్యసించు నెపమున జాతీయత పెంపొందించు ఉపన్యాసములిచ్చే వ్యక్తులనే పరికోరి తెచ్చుకొనుము.

ఏ నాటకమాడినా, ఏ పాటపాడినా, ఏ ప్రదర్శనశాల తెరచినా, ఏ ప్రదేశాలు చూచుటకు పోయినా అవి జాతీయతను పెంపొందించేవిగా వుండాలి.

వేయేల? చుట్టంచూపులుకూడా జాతీయభావము, సంఘీభావము పెరుగుటకు ఉపయోగపడే సమావేశాలుగా వుండాలి.

జర్మనీచే బలవంతంగా ఆక్రమింపబడిన ప్రాంతములందున్న చెక్ వారితోను, తోటి దేశభక్తులతోను రహస్యమైన సంప్రదింపులు జరుపుచునేవుండాలి. ఇతర ప్రాంతములందున్న చెక్ వారితోకూడా సంబంధము పెంపొందించుకోవాలి. ఇతరప్రాంతములందలి వార్తాపత్రికలను దొరకబుచ్చుకొని వాటిలోని సత్యవార్తలను ప్రచారం చేయాలి.

సత్యమునుగూర్చి అతిజాగ్రత్తగా వుండాలి. కాని ఉద్రిక్తులు అయి విషయం చెరపకూడదు. పుకారులను ప్రచారములోనికి రాకుండా చేయాలి. శత్రువు ఎప్పుడు పుకారుపుట్టించుచు వ్యతిరేక ప్రచారము సాగించును. అట్టి ప్రచారము మొదలంట వూడబెరకవలెను.

వీలగునంతవరకు మన పరిసరజాతులభాషను నేర్చుకొనుము. ముఖ్యముగా మన శత్రువుల భాష అభ్యసించి వారి ప్రచారములను జాగరూకుడవై గమనింపుము. తరుణమునకై వేచియుండుము. స్లావాకులతో అన్యోన్యముగా ఉండుము. వారుకూడా దేశభక్తులనే సంగతి గుర్తింపుము. పోలెండు, అమెరికా, యింగ్లండు, ఫ్రాంసు, రష్యా- ఇవియేల అననేల? ఆఖరికి ఇటలీకూడా మనయందు వారికిగల సంబంధము

ను మరువరని మాత్రము నిశ్చయముగా తెలుసుకొనుము.

భయంకరమైన జర్మన్ పిశాచముతో యుద్ధమునకు తలపడనున్నాము. భగవదనుగ్రహమువల్ల దానికోరలు పెరుకబడును, దాని కుత్తుక ఖండింపబడును.

యువకులారా! దేశస్వాతంత్ర్యమునకై మీరక్తము ధారపోయ సిద్ధముకండు. సత్యమునే నమ్ముడు. ఝుంఝూక్, మాజరిక్ వంటి మహావీరులను స్మరింపుడు. మా కర్తవ్యమునకు కడంగుడు."

❦

ఒకప్రక్కను జెక్ యువకులలో ఇట్టి సంచలనము బయలుదేర, వేరొకప్రక్క జర్మనులు తమశక్తి వంచనలేకుండా వారి యుత్సాహములను భగ్నముచేయ విశ్వప్రయత్నము చేయుచున్నారు.

నాటకశాలలు, నృత్యశాలలు జాతీయతను వృద్ధిచేయునవని నేడుజర్మనులు అట్టి జాతీయనాటక ప్రదర్శనములను నిషేధించిరి. ఆకారణమువనే కొన్ని జాతీయగీతములుకూడా నిషేధింపబడినవి. పురపాలక సంఘములను పూర్తిగా జర్మనులు ఆక్రమించుచున్నారు. కొన్ని నగరములందు బలవంతముమీద పురపాలక సంఘములను తొలగించి వాటి స్థానములందు జర్మన్‌లను నియమించినారు. అంతే కాదు. నేడు జర్మనులు జెక్ స్థానికపరిపాలనపూర్తిగా నిర్మూలం చేయాలని సంకల్పించుకున్నారు. జెక్‌ల ఆర్థిక, రాజకీయ, వైజ్ఞానిక స్వాతంత్ర్యమును ధ్వంసము చేయుటేగాక ఈకొద్దిపాటి స్థానికస్వపరిపాలనా స్వేచ్ఛనుకూడా లేకుండాచేయ సంకల్పించారు.

కాని ఒకటిమాత్రము నిశ్చయము. ఒత్తిడివృద్ధి పొందినకొద్దీ ప్రతిఘటనాశక్తి బలీయమగును.

నేడు జెక్‌లాండులోని జర్మన్‌లు తమనీడ చూసుకొని తామే భయమందుచున్నారు. కాగా చెక్ రాజ్యమందలి జర్మన్‌లు తమ ఆత్మరక్షణకై చెక్ జాతీయులవద్దనుండి బహుమానపత్రములను సంపాదించుకొనుచున్నారు. స్లావాకులు రాజకీయముగా హీనస్థితిలో నున్నారు. కాగా వారిని రెచ్చగొట్టి చెక్ వారితో కలహముల పెంపొందించి తాము ఆకలహములవల్ల లాభముపొంద చూచినది జర్మనీ. కాని లాభము లేకపోయినది. జర్మనీ సహాయము యొక్క ఉద్దేశ్యము వ్యక్తమైనది. మూడుమాసములకే స్లావాకులకు కూడా జర్మన్‌లంటే అసహ్యము పుట్టింది.

ఆనాడు చెకోస్లావాకు విచ్ఛేదము కావలెనన్నవారే నేడు తిరిగి దాని సంయోగమును కోరుచున్నారు.

మ్యూనిక్ ఒడంబడిక మూలముగా హిట్లర్ చెకస్లావాకియాస్వతంత్రరాజ్యమును ధ్వంసంచేసాడు. బెదిరించి వారి ప్రాంతములను కబళించాడు. అతని ప్రవర్తనవల్ల అతడే తిరిగి చెకస్లావాకిస్వతంత్రరాజ్యస్థాపనకు పునాదులు వేస్తూయున్నాడు. ఇప్పుడు స్థాపింపబోవు స్వతంత్రరాజ్యము పూర్తిగా స్వశక్తిమీదనే ఆధారపడునదిగా వుంటుంది.

ఎన్ని అవస్థలు పెట్టినా చెక్ జాతీయులు నిరుత్సాహం చెందక క్రమశిక్షణకు లోబడివున్నారు. చెక్ జాతి తరతరాలనుండి పరదేశీయుల పాలనలో ఎంత ఓర్మి కలిగియుండాలో నేర్చుకొన్నది. కావున నేడు కూడా చెక్ జాతి శాంతముగా గంభీరముగా ఓర్పుతో జర్మనుల రాక్షసకృత్యములను ప్రతిఘటిస్తూ వుంది.

1620 లో తెల్లకొండవద్ద (White Mountain) జరిగిన యుద్ధములో చెక్ జాతి జమీందారులు ఓడిపోయిరి. దానితో పరప్రభుత్వమును ప్రతిఘటించే బాధ్యత సామాన్య ప్రజలపై బడినది. కాగా ఆప్రభుత్వమును వశపరచుకొన్న కర్షక కార్మికులు అద్భుతశక్తిని వృద్ధిచేసికొని జాతీయజీవనమునకు నూతన చైతన్యమును యిచ్చిరి.

నేటికిని ఆకర్షక కార్మికులే ఆ జాతికి జీవగర్ర- వారే నేడుకూడా ఈ పరదేశపు బందిపోటులను ధైర్యముతో ఎదిరింప సమకట్టిరి. వారు జర్మన్‌ల ప్రబోధములకు చెవియొగ్గినను ఆత్మలో తమ జాతిఅభిమానమునే పోషించుకొనున్నారు. ఎరకై వేచియున్న సింగముపగిది ఆ స్వాతంత్ర్యప్రియులు తరుణమునకై వేచియున్నారు. యుద్ధమువచ్చుచో జర్మనీ ధ్వంసము సిద్ధమనియే వారిపాట.



# విడ్డూరములు

### ౧. ఆపరేషన్ చేసి మనిషిని మార్చివేయవచ్చు :

మనిషి మేధస్సుకు సంబంధించిన శాస్త్రంలో డాక్టర్ గోస్టా క్రైలాన్‌డర్ సుప్రసిద్ధుడు. అతడు స్వీడన్ దేశపు వాడు.

అతడు మనిషి మెదడులో ఆపరేషన్ చేసి ఆమనిషికి ప్రాణాలతోటి జన్మాంతరాన్ని తీసుకువచ్చి ఆమనిషిని పూర్తిగా మార్చివేయవచ్చునని నిరూపించాడు.

ఒకమనిషి అస్తమానూ మతగ్రంథాలే చదువుతూ చాలా సీరియస్‌గా వుండే వాడు. మనడాక్టర్ వాడి మెదడును ఆపరేట్ చేశాడు.

దరిమిలాను ఆమనిషి పూర్తిగా మారిపోయాడు. అతనిలో సీరియస్‌నెస్ అంతాపోయింది. కాలిబంతి ఆటలంటే, పాటకచ్చేరీలంటే ఇప్పుడు అతనికిఎంతో ఇష్టం ఏర్పడ్డది.

అతడు ఇప్పుడు సాధారణంగా మతగ్రంథాలు ముట్టుకోడు. ఎప్పుడే నా ఖర్మంచాలక పుస్తకంపట్టితే అది హాస్య పత్రిక అయివుంటుంది.

ఇప్పుడు అతనికి సినీమాల సరదా బాగాపట్టింది.

### ౨. పురుడు ఎప్పుడువస్తుందో సూటిగా చెప్పివేసేయంత్రం:

సెంట్‌లూయీ అనే తావున జరిగిన అమెరికన్ మెడికల్ అసోసియేషన్ వారి కాన్ఫరెన్సులో డాక్టర్ డగ్లస్ మర్ఫీ అనేవాడు ఒక వింతయంత్రం ఉనికిని బయటపెట్టాడు.

ఆయంత్రం పేకముక్కల పెట్టిఅంత మాత్రం వుంటుంది. ప్రసవవేదన పడుతూవున్న స్త్రీకి దానిని తాకించాలి. వెంటనే ఆయంత్రం ఆమూలాలిస్థితిన్నీ, సరిగ్గా పురుడు ఎన్నిగంటలకువచ్చేసేదిన్నీ తెలియచేస్తుంది.

బుడాపెస్టులోని వైద్యుడు ఒకడు దానిని కనుగొన్నాడు. డాక్టర్ డగ్లస్ మర్ఫీ ఆయంత్రాన్ని మూడువందల మంది గర్భవతులమీద ప్రయోగించి పరీక్షించాడు. వారి అందరివిషయంలోనూ అది బాగా జోస్యం చెప్పింది.

ప్రసూతివేదన కష్టంగావుండే స్థితిని కూడా అది బయలుపెట్టేది. అందువల్ల అట్టి గర్భిణులకు తరుణంలో వైద్య సహాయం చేయడానికి అది బాగా అక్కరకు వచ్చింది.

### ౩. పెద్దపులులలో పలురంగులవి కూడా వున్నాయి:

పెద్దపులిచర్మం- చాలామంది చూచి వుంటారు. అది ఏరంగులో వుంటుంది?

అయితే అన్ని పెద్దపులులు అదేరంగులో వుండవు.

కొన్ని పసుపుపచ్చవి, కొన్ని ఎర్రవి, కొన్నినల్లవికూడా వున్నాయి. ఈరంగుల పెద్దపులులను హిందూదేశంలో పలుతావులయందు చూచామని శాస్త్రవేత్తలు చాలామంది చెబుతూవున్నారు.

నల్లరంగు పెద్దపులుల విషయమై కలకత్తాలోని ఇండియన్ మ్యూజియంకు చెందిన ఇండియా జ్యూలాజికల్ సర్వే డైరెక్టరు ఈక్రింది సంగతులు చెబుతున్నాడు:

1846 లో చిటకాంగుచెంత సి. టి. బక్‌లాండ్ అనేవాడు ఒక నల్లపెద్దపులిని చూచాడు. ఈసంగతి 1889 లో ఫీల్డు అనేపత్రికలో అతడు వివరించాడు కూడాను. కారణాంతరాలచేత ఆపులి చర్మం భద్రంచేయడానికి అవకాశంలేకపోయింది.

బొంబాయి నాచురల్ హిస్టరీ సొసైటీవారి పత్రిక 22-వ సంపుటంలో బర్మాలోని భామాలో కనిపించిన మరి

ఒక నల్ల పెద్దపులినిగురించి వివరంగలదు. దీనిని వేటాడారు. కాని పారిపోయింది. దొరకలేదు.

మరో నల్లపెద్దపులి అస్సాములోని లూషియా కొండలలో చనిపోయివున్న స్థితిలో ప్రజలకళ్ళబడింది. కాని అప్పటికే అది బాగా కుళ్ళిపోయినందువల్ల దాని చర్మాన్నికూడా జాగ్రత్తచేయడానికి వీలులేకపోయింది.

---

## ౬. ముప్ఫయిఏళ్లుగా గర్భాన్ని ధరించివున్నది :

రష్యాలో కావ్నొఅనే గ్రామం. ముప్ఫయిఏళ్ళక్రితం అక్కడ ఒక యూదు జాతికర్షకురాలు ఏడోసారి గర్భాన్ని ధరించింది.

మొదటి ఆరుగర్భాల లాగానే ఈ గర్భానికికూడా ఆమెకు యథాకాలంలో కొద్దిగా బిడ్డనొప్పులు కనిపించాయి. కాని పురుడుమాత్రం రాలేదు.

అట్లాగే సంవత్సరాలు గడిచిపోయాయి. ఆమెకుటుంబం రష్యానుంచి అమెరికాసంయుక్తరాష్ట్రాలకు వలసపోయి అక్కడి డెట్రాయిట్‌లో స్థిరపడింది.

డెట్రాయిట్‌లోని డాక్టర్ ఆమెను పరీక్షచేసి ఎక్సరేతీసి చూశాడు.

గర్భంలోని శిశువు మృతశిశువై వుంది. కాళ్లు, చేతులు, మిగతా అవయవాలు అన్నీ సరియైన స్థితిలోనే వున్నాయి. అయినా అది గర్భాశయానికి అవతలగా వుంది. కాని గర్భాశయంలో లేదు.

దానిని బయటికి తీయడమా తీయక పోవడమా అనేవిషయంలో ఆ డాక్టర్ ఇంకా తుదినిర్ణయానికి రాలేదు.

---

## ౬. రేజరుబ్లేడ్‌లను పిప్పరమెంటు బిళ్లలలాగు మింగుతాడు :

శివుణ్ణిగురించి వర్ణించేటప్పుడు మన కవులు అతడు హాలాహల విషాన్ని అల్లనేరేడుపండులాగున మింగివేశాడంటారు.

హాలాహల విషంకంటె హానికరమైన రేజరుబ్లేడ్‌లను అలవోకగా మింగివేసే అపరశివుడు ఒకడు ఇపుడు బయలుదేరాడు.

లీ పట్టణానికి చెందిన జార్జివిల్సన్ అనే ఆసామీ ఒకసారి కత్తినిమింగే గారడీని చూచాడు. ఇది ఎట్లు సాధ్యమా అని ఆలోచనలు సాగించాడు.

నెమ్మదినెమ్మదిగా రేజరుబ్లేడ్‌లు మింగడానికి ప్రారంభించాడు.

ఇప్పుడు అతడు రేజరుబ్లేడ్‌లు, పెన్సిళ్లు, పాతకర్రముక్కలు, గోళ్లు సునాయాసంగా మింగివేస్తాడు.

దవడపళ్లు బాగావుండి నరాల బిగిగలవారు ఎవరైనాసరే ఈపనిని చేయగలుగుతారని అతడు అంటాడు.

నోటిలో ఉమ్మిఊరడం తక్కువై కంఠంలో తడి ఆరిపోతే ప్రమాదం జరుగుతుందికాని లేకపోతే రేజరుబ్లేడ్‌లు మింగినా ఏమీ భయంలేదని అతడు అంటాడు.

---

## ౬. వెంట్రుకను పరీక్షచేసి మనిషిని పట్టిపట్టవచ్చు :

మనిషిని పట్టిపట్టడానికి ఇంతవరకు వేలిముద్రలు మొదలయినవి చాలా బాగా ఉపయోగిస్తున్నాయి.

అట్టి విషయాల్లో ఇప్పుడు తలవెంట్రుకల్ని కూడా ఒకసాధనంగా గ్రహించవచ్చునని ఒక శాస్త్రవేత్త కనుగొన్నాడు.

ఆశాస్త్రవేత్తపేరు డాక్టర్ కార్లటన్ హుడ్. అమెరికాసంయుక్తరాష్ట్రాలకు చెందిన నార్తువెస్టరన్ యూనివర్సిటీవారి శాస్త్రీయ అపరాధ పరిశోధ కళాశాలలో అతడు ఉద్యోగి.

వేలిముద్రలలో ఎట్లు వివిధత్వం వుందో తలవెంట్రుకలలో అట్లే వివిధత్వం వుందని అతడు అంటాడు.

వెంట్రుక నిరంతరం ఎదుగుతూ వుండదు. కొంతకాలం ఎదిగి- మరికొంతకాలం ఎదగడం మానివేసి, తిరిగి ఎదగడం ప్రారంభిస్తుంది.

మానివేసినప్పుడల్లా ఆవెంట్రుకమీద ఒక ఆనమాలు ముద్రితమౌతుంది; మళ్ళీ ఎదగడం ప్రారంభమై చర్మాన్నిదాటి బయటికివచ్చేటప్పుడు ఆవెంట్రుకమీద అక్కడ ఆనమాలు బాగా పడుతుంది.

యౌవనంలో వెంట్రుక బాగా అంటే చురుకుగా ఎదుగుతుంది. తరవాత మందగిస్తుంది.

కాగా ఒక తలవెంట్రుకను తీసుకొంటిమంటే అది ఎంతవయస్సుగల మనిషి తలమీదిదో సులభంగా చెప్పివేయవచ్చు.

ఒక మిల్లిమీటరులోని పదోభాగం పొడుగుగల వెంట్రుకకు ఆరు ఆనమాళ్లు వుంటే ఆమనిషి ఇరవై ఏళ్ళవాడనీ, పంద్రెండు ఆనమాళ్లువుంటే ఆమనిషి నలభై ఏళ్ళవాడని ఆడాక్టర్ నిర్ణయం.

ఈపరీక్షతో ఆడాక్టర్ ఒక హంతకున్నిగుర్తించిశిక్షించేవిషయంలోపోలీసువారికి సాయపడ్డాడని తెలుస్తూవుంది.

# విక్రమసంవత్సర విజయదశమిలోగా ప్రత్యేకాంధ్ర రాష్ట్రనిర్మాణము

**21_వ ఆంధ్రమహాసభలో శ్రీ తెల్లాకుల జాలయ్య శ్రేష్ఠి ఆహ్వానసంఘాధ్యక్షోపన్యాసమునుండి.**

మాతృదేశానురాగము- ప్రతినిధుల ఉత్సాహ మేధా సంపదలతోడను, క్రియాపరత్వముతోడను మేళవించి ప్రమాదిసంవత్సరము ముగియులోపల ప్రమాదము నెల్లనూ తొలగించుకొని విక్రమసంవత్సరాదిలోపుననే స్వతంత్ర ఆంధ్రరాష్ట్రము నిర్మింపబడగలదని ఆశించుచున్నాను. వీరవిక్రమ ప్రణాళికలు ఈ మహాసభయందు వినిర్మింపబడి కనీసము విక్రమ సంవత్సర విజయదశమికైన ఆంధ్రరాష్ట్రము సిద్ధించి ఆ పర్వదినము మామూలు విజయదశమిగా గడచిపోవక విక్రమవంతులగు ఆంధ్రులుకోరి సాధించుకొనిన స్వతంత్రరాజ్యలక్ష్మియొక్క విజయోత్సవదినముగా పరిణమించును గాక!

ఆంధ్రులకు రాష్ట్రము ప్రత్యేకముగ లేనందున ఆంధ్రరాష్ట్రపు ఆదాయము ఆంధ్రదేశమునకన్న యితర ప్రాంతములకు ఎక్కువగ వినియోగపడుచున్నది. ఆంధ్రదేశపు నానావిధవ్యవహారరంగమునందెల్ల అభిప్రాయ ప్రకటనకును; కళాశాలలలోను, పాఠశాలలలోను విద్యాబోధనాసాధనముగను; నిరంతరము విరివిగ ఉపయోగపడుచుండవలసిన ఆంధ్రభాష తన యింటనే తాను తనకు చెందవలసిన గౌరవమునకు ప్రాముఖ్యమునకు నోచుకొని యుండనిదై భరింపరాని న్యూనతకు పరాభవమునకు లోను చేయబడినది. ఆంధ్రులు మేధాసంపదయందుగాని, విద్యావివేచనాశక్తులలోగాని భారతదేశమందలి ఏజాతివారికిని ఏప్రాంతమువారికిని ఎంతమాత్రము తీసిపోవనివారై యుండియు ఆంధ్రదేశమునందలి ఉద్యోగములలో ఆంధ్రులచేతనే ఆక్రమింపబడియున్న వానిసంఖ్య కొన్ని ప్రభుత్వశాఖలయందు కేవలము పూజ్యము. పెక్కండ్రహృదయవిదారకమగు బహు స్వల్పసంఖ్య ఏ జాతికిగాని గాలిబీల్చుట, నీరుద్రావుట, ఆహారము భుజించుటయను కార్యములు ఎట్లు అనునిమిషమును అత్యంతము అవసరములై యున్నవో ఏకభాషను మాట్లాడు ఒకే ప్రాంతప్రజనులు మరియేయితరులతోడను సంబంధము లేని ప్రత్యేకరాష్ట్రముగ నేర్పడి తమపనులను తాము దిద్దుకొనగల్గుట యనునది, వారికిని అట్లె అవసరమై వారికెవ్వరును నిరాకరించుటకు ఎంతమాత్రము వీలులేనటువంటి జన్మహక్కై యున్నది.

ఆంధ్రులకు ఈ జన్మహక్కును వెంటనే ప్రసాదించవలెనని ప్రభుత్వమువారిని, ప్రసాదింపచేయవలసినదిగా భారత జాతీయసభవారిని మనము చిరకాలమునుండి అర్థించుచుండిన దాని ఫలితముగా ప్రభుత్వమువారు మన కింతవరకును చేసినదేమియు లేకున్నను జాతీయమహాసభవారు మాత్రము తత్సభాకార్యముల నిర్వహించెడు పనులకుగాను ఆంధ్రరాష్ట్రమును ప్రత్యేకమయిన కాంగ్రెసు రాష్ట్రముగా నిర్మించుటమాత్రమేగాక యావత్ భారత దేశమును భాషాప్రయుక్త రాష్ట్రముగా విభజించి ఆంధ్రుల కృషిని తమచేతనున్న కార్యక్రమ విషయములో మాత్రము వెంటనే బహూకరించి మన కృతజ్ఞతను చూరగొనినవారైరి. ఇటీవల అఖిలభారత కాంగ్రెసు సంఘమువారు బొంబాయియందు సత్వరము ఆంధ్రరాష్ట్రము ప్రత్యేకింపవలసినదిగా తీర్మానించినందుకు కొనియాడతగినదిగాని కార్యనిర్వాహకవర్గమువారు ఇంతవరకు యే

మియు చర్యగైకొనకుండుట శోచనీయము.

1939 లో బ్రిటిషు పరిపాలన క్రిందనే ఏదోవిధముగ రాజకీయ స్వరాజ్యము రాష్ట్రములకు ప్రాప్తించినది. కాని ఆంధ్రరాష్ట్ర సిద్ధికి ఈ స్వరాజ్యము గూడను ఇంతవరకు యెంతమాత్రమును ఫలప్రదమగు ఉపకారము చేయగలిగినది కాదు.

1939 నుంచి ప్రారంభమయిన యీ క్రొత్తమార్పులలో గూడా స్వతంత్రరాష్ట్రము లేనప్పుడే బ్రిటిషు ప్రభుత్వపు నిరంకుశత్వపు కరుకు ధోరణికి ప్రబలకంటకులై వర్తించిన ఆంధ్రులకు రాష్ట్రము గూడ కట్టిబెట్టినచో కొరివితో తల గోకికొనినట్లగునని బ్రిటీషు ప్రభుత్వము వారు తలంచిరి. అందుచేతనే వాయవ్యసరిహద్దు— పరగణాలో ఇంతవరకును తమ అదపుక్రిందకు వచ్చియుండని సరిహద్దుజాతులను ఈ యెర వేసి పడగొట్టుటకుగాను ఆరాష్ట్రమునన్నూ; సింధు ఒరిస్సా రాష్ట్రములు ప్రత్యేకముగ నిర్మింపబడినచో అవి భారతజాతీయత పక్షమునకు యెదురై ప్రభుత్వపక్షమునకు అండలై నిలువగలవను దుర్భ్రమతో సింధు ఒరిస్సాలలోను ఆ రాష్ట్రములవారు ఆంధ్రులుచేసిన కృషిలో వీసమువంతైనను తము రాష్ట్రసిద్ధికొరకై చేసియుండకపోయినను 25 యేండ్లనుండి కృషి చేయుచుండిన ఆంధ్రులకు రాష్ట్రము రానిదే అంతకుముందుగనే తమకు రాష్ట్రము సిద్ధించునని ఆ రాష్ట్రవాసులెవరైనను కలనైన అనుకొనుచుండని తరిని, హఠాత్తుగాను తలవనితలంపుగను సింధు ఒరిస్సా వాయవ్యపరిగణాలకు రాష్ట్రపుఖర్చులు భరింపలేని స్థితియందుండినను ప్రత్యేకరాష్ట్రములు ప్రసాదింపబడి తన ఖర్చులు తాను భరించి యితరులకు పెట్టుబడి పెట్టగల ఆంధ్రరాష్ట్రము మాత్రము అట్లే వుంచబడినది. ఆంధ్రులు వస్తుతః కేవలము పరార్థపరులే అయివుండి తరచుగా తమ మేలును గూడా తాము మరచుచుండెడు విశాలమనస్సులగు జాతియై యుండుటయే యిందులకు ప్రబల కారణము. హటాత్తుగా కలిగిన ఈ అవమానము ఆంధ్రదేశము భరింపజాలక వెంటనే మేల్కాంచినది. ఈ జన్మహక్కు నిరాకరణమునకు ఈరీతిగా గురిచేయబడినది.

భారత శాసనసభలుగాని భారత ప్రభుత్వముగాని యేకారణము చేనైన సత్వర ఆంధ్రరాష్ట్ర నిర్మాణమును సమర్థింపకపోవుట తటస్థించునెడల అట్లుజరుగు వరకును మద్రాసు మంత్రులందరును. మదరాసు శాసనసభలలోని కాంగ్రెసు సభ్యులందరును, భారతశాసనసభలలోని కాంగ్రెసు పక్షమునకు చెందిన ఆంధ్రసభ్యులందరును తమ పదవులకు రాజీనామాలొసంగవలెననిగాని— లేదా ఆంధ్రమంత్రులు మాత్రమును కేంద్రమునందును మదరాసునందుగల అన్నిశాసనసభలలోని కాంగ్రెసుపక్షమునకు చెందిన ఆంధ్రసభ్యులందరును రాజీనామాలు ఇవ్వవలెననిగాని ఆదేశించి ఆంధ్రరాష్ట్రము సిద్ధించువరకు ఏ శాసనసభకును యే ఆంధ్రుడును సభ్యత్వము నర్థింపక ఆంధ్రరాష్ట్రసిద్ధికై చేయబడు యితర ప్రయత్నములన్నిటియందును పాల్గొనవలెననిగూడా ఆదేశించి అట్టిప్రయత్నము లన్నింటికి సర్వసహాయము చేయుదుమని పూచీ యిచ్చుటయే కాక బాధ్యతయును తానే వహించుచూ కాంగ్రెసు తీర్మానించవలయును. భారత శాసనసభయొక్కయు భారత ప్రభుత్వము యొక్కయు ఆమోదమును పొందిన పిదపకూడ బ్రిటిషు ప్రభుత్వమువారు ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రమును నిర్మించుటకు నిరాకరించుట తటస్థించునెడల జాతీయ మహాసభ కార్యనిర్వాహకవర్గమువారు అట్టి సందర్భమునగూడ పైన సూచించిన కార్యక్రమమును సాగించుటయే కాక భారతశాసనసభయందలి కాంగ్రెసు సభ్యులందరును అన్నిరాష్ట్రములలోని కాంగ్రెసుప్రభుత్వమున్నూ అన్నిరాష్ట్రములలోని శాసనసభ లన్నిటియందలి కాంగ్రెసుసభ్యులను రాజీనామాల నియ్యవలెననికూడ తీర్మానించి ఆంధ్రరాష్ట్రసిద్ధికి యింకా కావలసిన ఇతర యేర్పాట్లు చేయవలెను. అప్పుడుమాత్రమే ఆంధ్రులయందు జాతీయమహాసభ వారికిని, వారి కార్యనిర్వాహకవర్గ

మువారికి సంపూర్ణాభిమానము కలదని ప్రపంచమునకు వెల్లడి కాగలదు. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమును, భారతికాంగ్రెసు సంఘ కార్యనిర్వాహకవర్గమును ఇట్టి పటిష్టమగు విధానముయొక్క అవశ్యకత లేకుండానే వెంటనే అవలంబించుట అవసరము. 21–వ ఆంధ్ర మహాసభ వారిచే నిర్ణయింపబడు ఏదోఒక నియమితకాలములో ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు తమ అంగీకారమును ఆంగ్ల ప్రభుత్వము తెలుపకపోయినచో 1940 జనవరి నుండియో 1941 జనవరినుండియో ఆంధ్రదేశమున అన్ని రకముల సత్యాగ్రహకార్యక్రమములు సాగించవలెనని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమును, అఖిలభారత కాంగ్రెసు సంఘ కార్యనిర్వాహక వర్గమును వెంటనే తీర్మానింపవలెను.

ఏకారణము వల్లనైనా కాంగ్రెసుగాని మరి మన యే మిత్రవర్గములుగాని వెంటనే మనకు సహాయము చేయుటకు సంకల్పింపకుండినచో మేము గెలిచినచో వచ్చెడు ప్రతిష్ట మన అందరిదీ, ఓడినచో వచ్చెడు అపఖ్యాతి మా ఆంధ్రులది, నాది అని ప్రకటించి ఆంధ్రరాష్ట్ర సంపాదనా సమరమును స్వతంత్ర్యముగ సాగించి మన ఆదర్శములు అమలుపరచగల ఆంధ్ర రత్నములు యింకను తెనుగుభూమిలో లేకపోలేదు. వుండివున్నారు. అట్టి కార్యక్రమమునకు బాగుగా తయారైయున్నవారి మిత్రులు, శిష్యులు. ఆంధ్రదేశమం దచ్చటచ్చట రాజకీయపు జపములు, హోమములు జరుపుచునేయున్నారని మనము తరచు వినుచునే యున్నాము.

ఇట్టి స్వతంత్ర కార్యక్రమము యెల్లపుడును కేవలము ఆంధ్రరత్నములచేతనే సాగింపవలసినపనిలేదు. స్వతంత్రరాష్ట్రములేని ఆకలి, ఆక్రోశములను, తాత్కాలికముగ అడంచుకొని చెరలాడుచున్న యే ఆంధ్రకేసరులో ఆంధ్రమహాపురుషులలో కూడ నేడు తా మాక్రమించియున్న ఇరుకుగుహలనుండి వెంటనే వెడలివచ్చి విశాలాంధ్రవనియందు స్వాతంత్రగర్జన ప్రజ్వరిల్లజేసి ఆంధ్రభూమికి విజయలక్ష్మిని చేకూర్చిన ఖ్యాతిని సంపాదించుటకు వీలులేకపోలేదు.

1907 లో బెంగాలుకు దొరకిన బిపిన చంద్రపాలు, సురేంద్రనాధ బెనర్జీలవంటివారు, 1939-1940 లో ఆంధ్రదేశమునం దీసమయమున లభింపకపోరు. నాడు వారికి ఉపకరించిన బహిష్కారాది సాధనలు నేడు ఆంధ్రదేశమునకూడా అవలంబింపబడి రాష్ట్రసిద్ధిని పొందించుటకు ఆటంకము ఉండబోదు.

ఆంధ్రరాష్ట్రము సిద్ధించుటకు పూర్వమేకూడా మద్రాసు ప్రభుత్వపు బడ్జెటులో ఆంధ్రరాష్ట్రపు ఆదాయమును, ఖర్చును ఆంధ్రరాష్ట్రము కొఱకు మాత్రమే ప్రత్యేకించియును. ఆంధ్రదేశములోని అన్ని ప్రభుత్వోద్యోగములందును, ఇకనుండి ఆంధ్రులే నియమింపబడినట్లుగనే కాక కొన్ని నిర్ణీతసంవత్సరములలోపల తెలుగుదేశములోని ప్రభుత్వోద్యోగము లన్నింటను తెలుగువారే ఆక్రమించియుండునట్లుగ నొక సమగ్రవిధానములు నిర్మించియును మద్రాసు ప్రభుత్వమువారును మంత్రులును ఉద్యమసిద్ధికై తాము చేయదగిన విధముగను తమ చేతనున్నదంతయు తాముచేసి రాష్ట్రము రాకున్నను రాష్ట్రము వచ్చినంతటి ఉపయోగము ఆంధ్రదేశమునకు కలిగింపవలెను అట్టి యేర్పాటును వెంటనే చేయవలెననికూడా అఖిలభారత కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గమువారు ఆదేశించి తీరవలయును. ఆంధ్రరాష్ట్ర స్వతంత్ర నిర్మాణమునకు మద్రాసు శాసనసభలోను మంత్రివర్గమునందును ఆంధ్రేతరులగు సభ్యులు, మంత్రులు అడ్డు తగులుచున్నారని బయలుదేరిన అపనిందను తప్పించుకొనుటకు, పైన సూచించిన సౌకర్యములను వారు ఆంధ్రులకుగాను రాష్ట్రము రాకముందే మనఃపూర్వకముగ చేయుటకు అంగీకరించుట న్యాయము. ఈ పనిని చేయవలసిన అవసరమును గూర్చి మద్రాసు శాసనసభలో గాని, ఆంధ్రసభ్యులందరు, కలిసి మద్రాసు మంత్రివర్గముచేత, వీలైనచో కాంగ్రెసుసంస్థయొక్క జోక్యములేకుండా నేకూడా, ఒప్పించి అట్లు చేయింపవచ్చును.

# మదరాసు (చెన్న) పట్టణపు చరిత్రలో కొన్ని ముఖ్యమైన తిథులు

## మొదటి 60 ఏళ్లు

[మదరాసు పట్టణపు మొదటి అరవై సంవత్సరాల (1639—1699) చరిత్రలో ముఖ్యమైన తిథులు కొన్ని ఇక్కడ పేర్కొంటున్నాము. దరిమిలా చరిత్రను సంబంధించిన తిథులు పైమాసపు సంచికలో ప్రచురితమగును.

—సంపాదకుడు.]

1639

(ఆగష్టు 22) తెనుగువాడు, పూనమల్లి నాయకుడు, దామెరవం శీనుడు మదరాసులో కోటకట్టుకోడానికి ఇంగ్లీషువారికి అనుమతి ఇచ్చెను. పాలకొల్లునివాసి, తెనుగువాడుఅయిన బేరీ తిమ్మన్న ఈవిషయంలో ఇంగ్లీషువారికి చాలాసాయం చేశాడు.

1640

(ఫిబ్రవరి 20) నాయకుని చే పొందిన కవులు స్థలాన్ని స్వాధీనం చేసుకునేటందుకు ఫ్రాన్సిస్ డే మద్రాసుపట్నానికి వచ్చాడు.

(మార్చి) మదరాసులో మొదటికోట నిర్మాణం ప్రారంభింపబడింది.

(ఏప్రెల్ 23) సెయింటుజార్జి దినాన్ని ఈకోటకు సెయింటుజార్జి కోట అని పేరుపెట్టబడెను. కూవము నదికి, సముద్రానికి మధ్యను వున్న స్థలంలో సెయింటుజార్జికోట వెలసింది.

దేశీయవర్తకులు, సాలీలు, దేవాంగులు, కలంకారీలు, ఇతరులువచ్చి ఇక్కడ స్థిరపడేనిమిత్తం ప్రోత్సాహం ఈయబడింది.

దేశీయులు ఈప్రదేశాన్ని స్థలదానకర్తఅయిన నాయకుని కోరికను అనుసరించి అతని తండ్రిపేర చెన్నపట్టణం అని పిలువజొచ్చిరి.

ఇంగ్లీషువారు మాత్రం ఆ వాగ్దానానికి విరుద్ధంగా దీనిని మద్రాసు అని వ్యవహరిస్తూవచ్చిరి.

1642

మదరాసులోని ఫోర్టు సెయింట్ జార్జి ఏజెన్సీవారు లండన్‌లోని ఈస్టిండియాకంపెనీ కోర్టుఆఫ్ డైరెక్టర్సువారికి జనరల్ లెటరు పేర మొదటిసారి అధికారపూర్వక ఉత్తరం వ్రాశారు.

జావాదీవిలోని బాంటమ్ రాజధానిలో మదరాసు ఒకభాగంగా ప్రకటింపబడ్డది.

జవాలో డిమాండులోవున్న వస్తువులను కోరమాండల్ తీరాన్నుంచి సరఫరాచేసే రేవుగా మదరాసు నిర్దేశింపబడెను.

1644

కోటకట్టడానికి ఇంతవరకు వెచ్చపెట్టబడ్డ పైకం 2,300 పౌనులు, మరిఒక 2,000 పౌనులు ఖర్చుపెడితే నిర్మాణం సర్వసంపన్నమౌతుందని అంచనా వేయబడెను.

నూర్గురు సోల్జర్లువుంటే కోట రక్షణవిషయంలో ఏమీ భయం వుండదని నిర్ణయం.

1652

బేకర్ మొదటి గవర్నరుగా పేర్కొనబడ్డాడు. మదరాసులో కుడి ఎడమకులాల తగాదాను ఇతను పరిష్కరించాడు. కోటలో సోల్జర్లు 26 గురు మాత్రమే వుండిరి.

1653

మదరాసు ఏజెన్సీ ప్రత్యేకరాజధానిగా మార్చారు.

1654

మదరాసు ప్రెసిడెన్సీలోని ఫాక్టర్లు ఇద్దరేవుండేటట్టు, సోల్జర్లు పది మందే వుండేటట్టు ఆర్డరు.

1659

సర్ థామస్ ఛేంబర్ గవర్నరు. తెలుగువాడైన పెద్దనాయకుడికి మదరాసునగరరక్షణార్థము కవులుఇచ్చాడు. మదరాసుపట్నమ్ అనబడే చెన్నపట్టణాన్ని సంరక్షించవలసినభారం అతనిది. అంటే అతను ప్రధానపోలీసు అధికారి అన్నమాట. అతనికింద ఇరవైభటులువుంటే నగరరక్షణ వ్యాపారం తృప్తికరంగా వుంటుందని భావించారు. చిన్నచిన్న సుంకాలు వసూలుచేసుకునే అధికారం- కొన్ని మాగాని పొలాలమాన్యం పెద్దనాయకుడికి, అతని భటులికి నఫాకింద ఈయబడెను.

1661

సర్ ఎడ్వర్డు వింటర్ ప్రెసిడెంటుగా నియమితుడగుట. గోలకొండ నవాబు అబుహస్సన్ కింద కర్నాటకప్రాంతసేనాని అయిన నెక్కమ్ ఖాన్‌తో ఇతడు విరోధపడెను.

1665

వింటర్‌ని స్థానభ్రష్టుని చేయడానికి అనుమతిపొంది ఫాక్సుక్రాఫ్టు ఫోర్టుసెయింటుజార్జికి వచ్చెను. కాని ఫాక్సుక్రాఫ్టుమీద రాజద్రోహనేరాన్ని మోపి వింటర్ అతన్ని ఖైదు చేసెను.

1668

ఈ విషయమై విచారణ సల్పడానికి సర్ విలియమ్ లాంగ్‌హారన్ వచ్చాడు.

1669

ఫాక్సుక్రాఫ్టు ఒక ఏడాది గవర్నరు.

1670

సర్ ఎడ్వర్డు వింటర్, ఫాక్సుక్రాఫ్టు ఉభయులూ ఇంగ్లండు వెళ్లిపోతారు.

మదరాసు గవర్నమెంటు ఆఫీసులో వుండే రికార్డులలో ఈ సంవత్సరపువే అతిప్రాచీనమైనవి. అవి జనరల్ లెటర్సు రూపంలో వున్నాయి.

సర్ విలియమ్ లాంగ్‌హారన్ ప్రెసిడెంటు నెక్కమ్‌ఖాన్ ద్వారా గోల్కొండనవాబునుండి కవులు పొందాడు. ఆకవులుద్వారా చెన్నపట్నము ఊరికీ, కోటకుకలిపి గోలకొండనవాబుకు ఏడాదికి 1,200 పెగోడాలు ఇవ్వడానికి లాంగ్‌హారన్ ఒప్పుకున్నాడు.

1672

సెయింట్‌థోమ్ (మైలాపురం)ను ఎడ్మిరల్ డిలాహే ఆధిపత్యాన్ని ఫ్రెంచివారు ఆక్రమించారు. డచ్చివారు సెయింట్‌థోమ్‌ను ముట్టడించారు. సర్ విలియమ్ లాంగ్‌హారన్ తటస్థుడుగావుండెను.

1674

డచ్చివారికి ఫ్రెంచివారు లొంగిపోవుట.

1676

ఫోర్టుసెయింటుజార్జి కోటలోని దుర్నీతినిగురించి విచారణ చేయడానికి మేజర్ పకిల్ కమీషన్. కోటలోని కొందరు సోల్జర్ల, రైటర్ల చెడునడతనుగురించి కోర్టుఆఫ్ డైరెక్టర్లవారికి రివరెండ్ పాట్రిక్ వార్నర్ జాబు.

1677

స్ట్రైయిన్‌షామ్ మాస్టర్ గవర్నరు. జింజి, వెల్లూరు దుర్గాల్ని శివాజి ఆధిపత్యాన్ని మహారాష్ట్రులు పట్టుకొనుట. మాస్టర్ శివాజీకి బహుమతులు పంపాడు.

1678

హైకోర్టు ఆఫ్ జూడికేచర్ ఏర్పాటుఅయ్యెను.

మదరాసు అధికారానికి లోబ

డివున్న ఇతరఫ్యాక్టరీలను మాస్టర్ సందర్శించాడు.

(ఏప్రెల్ 1) ఫోర్టు సెయింట్ జార్జికోటలో సెయింట్ మేరీచర్చి స్థాపింపబడ్డది.

కలంకారీలు తిరుగుబాటు చేశారు.

పూనమల్లినాయకుడు ఫోర్టుసెయింటు జార్జికోటను ముట్టడించాడు.

1681

విలియమ్ గిఫ్ఫర్డు గవర్నరు. మాస్టర్ భ్రష్టత.

1682

సముద్రం బాగాముందుకు చొరబారుట. కౌన్సిల్ మెంబర్లలో ఒకడైన బ్రిడ్జర్‌ను హఠాత్తుగా తొలగించివేశారు.

1683

బానిసల రవాణాను అరికట్టవలసిందిగా ఆర్డర్లు జారీ చేయబడుట.

1684

హైకోర్టుఆఫ్ జూడికేచర్ గదిలో కోర్టుఆఫ్ ఎడ్మిరాల్టీ ఏర్పాటు. జడ్జి అడ్వొకేట్ నియామకం.

మద్రాసు నివాసులనుండి నెలవారీ పన్నునువసూలు చేయడానికి ప్రయత్నం.

1685

పన్నునియామకం విషయంలో కష్టాలు.

1686

గోలకొండ నవాబునుండి సెయింట్ థోమ కవులుకు తీసుకొనే ప్రయత్నం. పోలీసుధర్మాలు నిర్వహించుకునే విషయంలో పెద్ద నాయకుడి కొత్తఏర్పాటులు.

గోలకొండరాజ్యంలోవిప్లవ క్రాంతి. మొగలాయిలు ఎత్తివచ్చే కల్పంలో మదరాసు రక్షించుకోనేటందుకు ప్రయత్నాలు.

1687

ఎలిహు ఏల్ గవర్నరు. బెంగాల్‌లో మొగలులతో ఇంగ్లీషువారి విరోధం.

సెయింట్‌థోమ్ పొందే విషయంలో ఇంగ్లీషువారికి, పోర్చుగీసువారికి స్పర్థ. ఔరంగజేబు గోలకొండను జయించుట.

1688

సెయింటుజార్జికోట మీద యూనియన్‌జాక్ ఎగరవేయుట.

సెయింటుజార్జి, పులికాట్‌ల నడుమ స్నేహసామరస్యాలు.

(సెప్టెంబరు 29) మదరాసులో కార్పొరేషన్, దానికి ఒక మేయరు ఏర్పడుట.

అస్యూరెన్సు ఆఫీసు ఒకటి స్థాపితమగుట.

మద్రాసు జనాభా 3,00,000 లుగా వుంటుందని అంచనా.

1689

కంపెనీసేవకులు బెంగాల్‌నుంచి వచ్చుట. విశాఖపట్టణంలోని ఇంగ్లీష్ ఫ్యాక్టరీమీద దాడి.

1690

మద్రాసులో ఆర్మీనియన్ జాతీయుల అభివృద్ధి. ఫ్రెంచినావలతో స్పర్థ. గవర్నర్ ఏల్‌కు అతని కౌన్సిల్‌కు తగాదా. ఏల్‌కు, మేయర్‌కు, కార్పొరేషన్‌కు అభిప్రాయభేదాలు.

1691

పోర్చుగీసు వారుచేసే బానిసవ్యాపారవిషయంలో కోర్టు ఆఫ్ డైరెక్టర్సు వారి ప్రయత్నాలు.

1692

అస్సద్‌ఖాన్ గ్రాండ్ వజీర్ నుంచి నవాబ్ జుల్ఫికార్ ఖాన్ నుంచి ఎగ్మూరు, పరశువాకము, తండూరు పట్టణాల్నిగురించి ఇంగ్లీషువారు కొలుపొందుట.

నాథానియేల్ హిగ్గిన్‌సన్ గవర్నరు. సర్ జాన్ గోల్డ్సుబరో కమిస్సారీ జనరల్.

దక్కన్‌లో ఔరంగజేబుకు, మహారాష్ట్రులకు యుద్ధం.

మొగలాయీసేన జింజికోటను ముట్టడించుట.

బ్లాక్ టవున్‌లోను, తిరువలిక్కేనిలోనూ దేవాలయాల్ని గురించి తగాదాలు.

1693

డచ్చివారు పాండుచేరిని ముట్టడించుట.

గవర్నరు హిగ్గిన్‌సన్‌కు సెయింట్‌థోమ్ బిషప్పుకు ఇంగ్లీషు

సరిహద్దుల్లో మతాధికారాన్ని గురించి అభిప్రాయభేదాలు.

పూనమల్లి నాయకుడితో ఎగ్మూరు, పరశువాకము, తిరువళిక్కేణి ప్రదేశాల్ని గురించి తగాదా.

1694

ఫోర్టు సెయింట్ డేవిడ్ మీద డాక్టర్ బ్లాక్‌వెల్‌కు ఆశాదృష్టులు వున్నాయి అని అనుమానం.

కోర్టు ఆఫ్ డైరెక్టర్లకు ఏల్ ఫిర్యాదుచేస్తూ వుత్తరం.

1695

జింజికోటవద్ద మొగలాయీ సేనలతాణ్యాం.

జుల్ఫికార్ ఖాన్, దావూద్ ఖానుల కిద్దరికీ తగాదా.

సెయింట్ థోమ్‌లో అస్తవ్యస్తపుస్థితి.

1696

సముద్రం భాగాముందుకి చొరబారుట.

నవాబ్ జుల్ఫికార్ ఖాన్‌తో వ్యవహారం కష్టతరమగుట.

కోరమాండల్ తీరానికి ఫ్రెంచివారు ఎత్తివస్తున్నారనే వార్త.

1697

హక్కులేకుండ నడుమవచ్చి ఆక్రమించే ఇంటర్‌లోపర్లతో ఎట్టి సంబంధం లేకుండా వుండేటందుకు అర్మీనియనుల కట్టడి.

వేపేరీ జుంకమీరా్ (సుంకాల అధికారి) మద్రాసుకుపోయే వస్తువులమీద లాండ్ కస్టమ్సు వసూలుచేయడానికి ప్రయత్నించుట.

అజన్‌గోలోని ఇంగ్లీషుఫ్యాక్టరీ మీద దాడి.

1698

నవాబ్ జుల్ఫికర్‌ఖాన్ జింజి దుర్గాన్ని పట్టుకొనుట.

సలీమ్‌ఖాన్ కడలూరు మీద దాడి సల్పుట.

సెయింట్‌థోమ్‌కు ఒక ఇంటరులోపరు వచ్చుట.

గవర్నరు హిగ్గిన్‌సన్ రిటైరు అగుట. అతనికిచెడ్డపేరు వచ్చుట.

థామస్ పిట్ గవర్నరు. ఫోర్టు సెయింట్ డేవిడ్‌నుగురించి పర్యాలోచనా...

రిజ్విక్ సంధి ప్రకటితమగుట. పాండుచేరి ఫ్రెంచివారికి తిరిగి ఈయబడుట.

1699

ట్రాంక్విబారులోని డచ్చి సెటిల్‌మెంటుమీద తంజావూరురాజు దాడిసల్పుట.

కొత్త ఈస్టిండియా కంపెనీ నిర్మాణం. తీవ్రమైన ఉత్తరప్రత్యుత్తరాలు.

గవర్నరు పిట్ పాతకంపెనీ తరఫున, కాన్సల్ పిట్ కొత్తకంపెనీ తరఫున— కొత్తకంపెనీ సేవకులు తాము ఇంగ్లండురాజు ప్రతినిధులమని ప్రకటించుకొనుట.

(సశేషము)

—'మద్రాసుచరిత్ర' నుండి.




# మనం నగలు ఎందుకు పెట్టుకుంటాము?

అలంకారానికిగాను మానవుడు ఆశ్రయించే సాధనాలలో భూషణాలు అతి ముఖ్యమైనవి.

అనాదికాలంనుంచీ భూషణాలు మానవుణ్ణి వ్యామోహపెడుతూ వున్నాయి.

ఈ వ్యామోహం ఎందుకొరకు?

మానవునికి సహజంగావుండే అలంకార ప్రియత్వాన్ని పరితృప్తి పరచడానికేకాదు—

భూషణాలు స్త్రీపురుషుల్ని సమంగా ఆకర్షిస్తాయి. వాటి కాంతి, సువర్ణము, తళుకు, అందమే కాదు వానిని ఆకర్షణీయంగా చేసేగుణాలు.

అవి పొందడంలోగల కష్టం, అవి అపరూపపు వస్తువులు కావడం మొదలయిన విషయాలు వానిని మానవులకు మరింత ప్రియతమాలుగా చేశాయి.

అయితే భూషణాలపట్ల కొన్నిమూఢనమ్మకాలుకూడా వున్నాయి. భూషణాలధారణకు ఈ మూఢనమ్మకాలు కూడా చాలావరకు కారణమని చెప్పవచ్చు,

* * *

అందులోనూ రాళ్లుపొదిగిన నగల విషయంలో ఈనమ్మకాలు మరీహెచ్చు. రాళ్ల ఉంగరాలు, రాళ్లుపొదిగిన చెవినగలు, చేతికంకణాలు, కంఠంలో వేసుకునేహారాలు అలంకారానికే కాక అ

నగలలోని రాళ్ల మహాత్మ్యానికి కూడా మానవులు వాటిని ధరిస్తూవున్నారు.

మనపూర్వులు రాళ్లు, పూసలు మొదలయినవి రక్షరేకులుగా ధరించేవారు. వాటిమీద వింతవింత ఆకారాలు చెక్కించుకునే వారు.

రాళ్లల్లో వానిఆకారాన్నిపట్టి, వాని రంగునుపట్టి వివిధములైన మాహాత్మ్యాలు వానికివున్నాయి అనేనమ్మకాలు ఇప్పటికికూడా మానవులలో ప్రబలివున్నాయి.

కొన్ని కొన్ని రత్నాలకు విద్యుచ్ఛక్తి, అయస్కాంతశక్తి మున్నగు శక్తులువుంటాయి అని ప్రజలనమ్మకం.

కొన్ని కొన్ని రాళ్లకు రోగనివారక, రోగనిరోధక శక్తులుకూడా వుంటాయి

అంటారు నేడుకూడా భూషణప్రియులు.

ఇంగ్లీషువారిలో ఒక చిత్రమైన నమ్మకంవుంది. ఒక్కొక్క నెలకు ఒక్కొక్క రకమైనరాయి అధిదేవత. అంటే పన్నెండు నెలలకు పన్నెండురాళ్లు అన్నమాట. ఆ నెలలోపుట్టినవారు ఆనెలకు ఉద్దిష్టమైన రాయిధరిస్తే శుభప్రదమై వుంటుంది.

కొన్ని కొన్ని రాళ్ళవల్ల యజమానులకు నిరంతరకష్టాలువుంటూవుండడముకూడా కద్దు. అయినా అంతమాత్రంచేత వానివాడకం తగ్గిపోవటంలేదు.

* * *

అలంకారప్రియత్వంవల్లనూ, మూఢనమ్మకాలవల్లనూ కాకుండా ఆభరణధారణంలో కొన్నికొన్ని తావుల ప్రత్యేకమైన ఉపయోగంకూడావుంది.

నిదర్శనంగా రాజపుత్రస్థానంలో కంకణాలనుగురించి చెప్పవచ్చు.

రాజపుత్రస్థానంలో ఒక స్త్రీ ఆపత్కాలంలో తన చేతికంకణాన్ని తన్ను రక్షించడానికి సమర్థుడు అనుకొన్న రసపుత్రవీరునికి పంపిస్తుంది. ఆకంకణానికి రక్షాకంకణమని పేరు.

ఆకంకణాన్ని అందుకోవడంతోటే ఆవీరుడు ఆ స్త్రీకి కంకణబద్ధసోదరుడు అవుతాడు. అప్పుడు అతడు తన సర్వశక్తులను ఉపయోగించి ఆ స్త్రీని ఆపదల నుండి సముద్ధరించాలి.

కంకణబద్ధసోదరుడు తాను ఆపనిని చేయడానికి అంగీకరిస్తున్నాననే సూచనకుగ్గాను ఆమెకు ఒకరవిక పంపాలి.

* * *

అత్యంత ప్రాచీనకాలంనుంచి హైందవులు అలంకారప్రియులుగా, ఆభరణవ్యామోహితులుగా వుంటూవున్నారు.

ఒకప్పుడు అనగా అడవులలో తిరిగే రోజులలో మానవుడుధరించే పూవుల దండలకు, గింజలదండలకు ప్రత్యామ్నాయంగా నేడు మానవుడు కాసులదండలు, తద్వికారమైన ఇతరహారాలు ధరిస్తూవున్నాడు.

ఇపుడు బంగారుహారాలకి మనం ఇచ్చే పేళ్లు మిరియాలపేరు, చంద్రహారం, చంపకళి, మల్లిమొగ్గలపేరు, మోహన్‌మాల, కరణఫల మొదలయినవన్నీ మానవుడు అడవిలో ధరించే అసలువస్తువులపేళ్లు ఇప్పటికీ నిలిచివుండడాన్ని తెలియజేస్తూవున్నాయి.

వస్తువులు ఇప్పుడు బంగారంతోనే చేస్తూవున్నారు. కాని వాటిపేళ్లు ఇంకా మానవుని అడవిసంబంధాన్ని తెలియజేస్తూనేవున్నాయి.

* * *

హిందువులలో అన్నికులాలలోనూ భర్తయగువాడు వస్త్రాలచేతనూ, ఆభరణాలచేతనూ భార్యను సంతోషపెట్టడం మతవిధి ఐవుంది.

నగలు ధరించకుండా బోసిమెడతో, బోసికాళ్ళతో, బోసిచేతులతో భార్య అయినది భర్త ఎదుట కనిపించకూడదు.

భర్త గ్రామాంతరగతుడు ఐతే భార్య ఆనగలను అన్నిటినీ దాచివుంచాలి. కాని శరీరంమీద ధరించకూడదు. దురదృష్టంచేత భర్త మరణించినట్లయితే భార్య ఆభరణాలనన్నిటినీ విడనాడవలసిందే.

* * *

ఒడ్డాణపు చిరుగంటల మ్రోతవలని ఆహ్లాదం- చెవిజూకాలను ముఖంచలించినప్పుడల్లా చెంపలకు తాకించే నేర్పువలని ఆమోదం- పాదంకదిపినప్పుడల్లా అందెలకడియాల గల్లుగల్లు ధ్వనివలని ఆనందం- పాంజేబుపట్టా మువ్వల చిరుసవ్వడివలని సంతోషం- చేయి తిప్పినప్పుడల్లా అయ్యేగాజుల గణగణధ్వనివలని ప్రమోదం- ప్రపంచంలోకిఅంతా ఒక్క భారతస్త్రీయే అనుభవపూర్వకంగా ప్రదర్శింపగలదు.

ఆభరణాల విశేషోపయోగాన్ని భారతస్త్రీ ఆకళించనంత ప్రబలంగా ప్రపంచంలో మరియే స్త్రీయూ ఆకళించలేదని చెప్పితే అది అతిశయోక్తికాదు.

స్త్రీలు పూజింపబడుచోట దేవతలు క్రీడింతురు.





# మహిళాలోకము

# మన స్త్రీలు రాజకీయాల్లో పాల్గొనవలెనా?

రచయిత :
గోవిందదాసు
చతుర్భుజదాసు

స్త్రీలు రాజకీయాల్లో పాల్గొనవలెనా? ఈసమస్యవిషయమై భారతీయులు తగినంత ఆలోచనచేయలేదని నాతలంపు.

స్త్రీపురుషులు సమానమనే భావం పూర్తిగా పాశ్చాత్య వాసనాదూషితం.

స్త్రీపురుషుల విషయమై మన హిందువుల అభిప్రాయం ఎట్టిది? పురుషుడు, స్త్రీ— పురుష, శక్తి— ఇవి వేరనే భావం మనవారికి లేనేలేదు. కాగా అవి సమానం అనేభావం మనవారికి కలగనే కలగదు.

పురుషుడు, స్త్రీ ఇరువురు ఒక్కరే అని మనవారి భావన.

ఈభౌతిక ప్రపంచంలో వారు వేరు వేరు రూపాలతో మనకు కనిపించినా వారు ఒకటే. వారు సమానులు అనే పదం వారు విభిన్నులు అనే అభిప్రాయాన్ని కలిగిస్తుంది.

విభిన్నులు అవడంతోటే విభేదానికి అవకాశంవుంది.

హిందువుల ఉద్దేశంలో స్త్రీలు, పురుషులు అనే ద్వైతంలేదు. అద్వైత భావంలో హెచ్చుతగ్గులుకాని, సరిసమానాలుకాని వుండడానికి అవకాశంలేదు.

భారతరమణీమణి సీతఎప్పుడుకాని తాను రామునినుండి వేరుగా భావించలేదు.

అట్లే భారత స్త్రీ సాంసారిక, సాంఘిక, మతవిషయాల్లో పూర్తిగా మగనితో లీనమైపోతుంది. అల్లా లీనం కావడం ఆమెకు అత్యందామోదాన్ని కలిగిస్తుంది. భర్తతో ఏకంకావడం, భర్త అభిప్రాయాలలో లీనంకావడం భారత స్త్రీకి ప్రధాన ప్రాప్యాలు.

ఆమె ఎప్పుడుకాని ఓటు కోరివుండలేదు. ఆమెకు అది అక్కరలేదు, ఆమెకు ప్రత్యేకముగా ఓటు ఈయడం ఆమెను ఆమె భర్తనుండి వేరుచేయడమే. ఆమె ఆలోచనలు ఎంతసేపూ భర్త ఆలోచనలే. అతనినుండి వేరుగా ఆమె భావించదు. కాగా ఆమెకు వేరుగా ఓటు ఈయడం అనవసరం.

భర్త ఒకకత్తు— భార్య ఒకకత్తు. ఈవిధానం భారతభూమిలో వర్ధిల్లచాలదు. భారతదేశంలో అఖిలభారత మహిళా మహాసభ వొకటి వుండడమూ, అది ఏటేట సమావేశమై తీర్మానాలు చేస్తూవుండడమూ నాకు తెలిసిన విషయమే.

అయితే వొకసంగతి. ఈసభల్లో, ఈ సమావేశాలలో పాల్గొనే స్త్రీలు నిజంగా భారత స్త్రీలకు ఎంతవరకు ప్రాతినిధ్యం వహిస్తున్నారు?

ఆంగ్లవిద్యతో పాశ్చాత్యవ్యామోహంలోపడి పొరలాడే పొలతుల వాక్చమత్కారం చూపించుకునే ఆటపలకలు ఈసభలు. ఈపొలతులు భారత స్త్రీలో కొన్ని తమ పక్షానికి ఏనాటికైనా తిప్పుకోగలగడం కలలోవార్త.

ఈసభల్లో పాల్గొనే పడతులను చూచి భారత స్త్రీలకు వీరు ప్రతినిధులని విదేశీయులు ఎవరేనా అనుకుంటే అది వట్టి భ్రాంతికింద మనం జమకట్టాలి.

ఇంటిపనులలోవలెనే బయటిపనులలోకూడా కొన్ని ప్రత్యేకమూ స్త్రీలే చేయతగినవి, కొన్ని ప్రత్యేకమూ పురుషులే చేయతగినవి వున్నాయి. బయటిపనులలోకూడా కొన్ని స్త్రీలుతప్ప పురుషులు చేయరానివి వున్నాయి. శిశుపోషణ - పిల్లలకు విద్యగఱపడం - మంత్రసానిపని - శిశుసంరక్షణశాలల నిర్వహణం - గ్రామపారిశుద్ధ్యము మున్నగు పనులు ప్రత్యేకము స్త్రీలు చేయతగినవి వున్నాయి.

ఈపనులలో స్త్రీలు శ్రద్ధవహించాలి అంతేకాని వారు పురుషులతో సమానంగా రాజకీయాలలో బుజాలు ఎగరవేయకూడదు.

రాజకీయాల్లో స్త్రీ అనేక తరగతుల పురుషులతో కలిసిమెలిసి తిరగవలసివస్తుంది.

స్త్రీ వలంటీర్లకు మనవారు దేశసేవికలని పెద్దపేరుపెట్టారు. ఈ దేశసేవికల

స్థితి శుచిప్రియులైన పెద్దలకు కంటగింపు అయినవిషయం. అది వొక అవమానకర విషయం. నైతికపతనానికి అది రాచబాట. ఉద్రేకపరులైన యువకులతో కలిసి పికెటింగు- యువకులతో బుజాలురాచుకుంటూ నగరసంకీర్తన-

స్త్రీకి సహజమైన సిగ్గు బుగ్గి అవుతుంది. ఆత్మసంయమశక్తి అంతరించిపోతుంది. అట్టిస్థితిలో పురుషులతో కలిసిమెలిసి తిరిగే స్త్రీ తన పావిత్ర్యాన్ని ఎట్లా నిలుపుకుంటుంది ?

ఇట్లా తిరిగికూడా తమ పావిత్ర్యాన్ని నిలుపుకున్న స్త్రీలు లేకపోలేదు. అయితే అట్టివారు గోవిందద్వాదశుల వలె చాలా అరుదుగావున్నారు.

పురుషులతో ఎరమరిక లేకుండా తిరిగే స్త్రీ తన పావిత్ర్యాన్ని చెరుపుకోకుండా వుండాలంటే ఆ స్త్రీ మానవాతీతురాలైనా కావాలి, లేదా మాచకమ్మ అయినా కావాలి.

సాధారణమైన స్త్రీ- ఉప్పు, పులుసు, కారం తినే స్త్రీ- వాంఛలు వీడని స్త్రీ- పురుషులతో కలసిమెలిసి తిరుగుతూవుంటే ఆమెపతనం కొకతప్పదు. అట్లుకావడం మానవస్వభావం.

రాజకీయవాతావరణంలో జాతీయమైన పోరాటంలో స్త్రీని పాల్గొననీయడం చాలా ప్రమాదకరమైనది.

రాజకీయాందోళన సంరంభంలో పాల్గొనడంచేత స్త్రీ చవక అయిపోతుంది. తన్ను తాను చవకచేసుకోవడంచేత ఆమె తన విలువను పోగొట్టుకుంటుంది.

అందుతో ఆమె సిగ్గు వీడుతుంది, ఆమె ఆకారంలోని మనోజ్ఞత మాగువారుతుంది. ఆమెశరీరానికి పవిత్రత లేకుండాపోతుంది. ఆమె ఆత్మగౌరవము అడుగునపడిపోతుంది.

అంతవరకు ప్రవర్తన విషయంలో అగ్నిశిఖలై వుండిన యువతులు పలువురు పికెటింగు మొదలయిన పనులలో పాల్గొనుట మొదలుపెట్టి మగవారితో ఎట్టి ఎబ్బెరికమూ లేకుండా మసలుటకు ప్రారంభించినతోడనే పతితులు అయిపోయిన నిదర్శనాలు పరశ్శతాలుగా వున్నాయి.

పతనంవల్ల వారు తమ తల్లి దండ్రులకు, భర్తలకు, సంఘానికి దూరమైపోయారు.

ఇక వారు మేము భారతదేశస్వాతంత్ర్యానికి పోరాడాము అని చెప్పినప్పుడల్లా మనకు నవ్వురాకుండా ఎట్లా వుంటుంది ?

దేశభక్తిపేరిట మన స్త్రీలను రాజకీయాల్లోదింపిన మహనీయులు మనదేశానికి ప్రబలమైన హానిని చేసినవారే అగుచున్నారు. వారిమూలంగా అనేకకుటుంబాలలో అశాంతిదేవత కాపరం పెట్టింది.

రాజకీయాలలో పాల్గొనడం మూలంగా స్త్రీలలో స్వాతంత్ర్యభావం యొక్క ఆభాస బాగా ప్రబలింది. కాగా వారు తల్లిదండ్రులమాటల్ని తోసిరాజని అంటూవున్నారు; మగనిమాటలకు మారు పలుకుతూవున్నారు.

స్వాతంత్ర్యన్నుండి స్వాతంత్ర్యాభాసకు- దేశభక్తినుండి విశృంఖలవృత్తికి దిగజార్చి నాయకులు మన స్త్రీలను పాడుచేశారు. అట్టి స్త్రీలలో స్త్రీత్వం మందులోనికైనా లేకుండాపోయింది.

మనవారు క్షేత్రపావిత్ర్యానికి ప్రాధాన్యమిచ్చారు. క్షేత్రం చెడితే ఆసంతతి అంతా చెడుతుంది. కావుననే వారు స్త్రీలను అదుపు, ఆజ్ఞలలో వుంచారు.

మనపూర్వులు ప్రకృతి ధర్మాలను బాగుగాఎరిగినవారు. అంతేకాని వారికి పురుషులకంటె స్త్రీలు తక్కువవారు అనేభావం లేనేలేదు.

ఇప్పుడు భారతదేశంలో స్త్రీకి వోటు ఈయబడింది. దానివల్ల భారతదేశానికి సాముదాయకంగా కలిగిన లాభంఏమిటి? మన స్త్రీలు కొంతమంది మునిసిపల్ కౌన్సిలర్లు, జిల్లాబోర్డుమెంబర్లు, శాసనసభలో సభ్యురాండ్రు అయినంతమాత్రం చేత మనకు కొత్తగాఒలికింది ఏమివుంది?

ఆమె స్త్రీ కాబట్టి ఆమెకు స్థానం ఇవ్వడంలో- ఆస్థానానికి ఆమె ఎంతవరకు అర్హురాలో తెలుసుకోకుండా ఇవ్వడంలో- పురుషుడు ఏదో తనపట్ల ఆధిక్యత ఆపాదించుకొంటున్నాడన్న మాట. అట్టి సందర్భంలో అతడు ఏదో దయాధర్మభిక్షంగా స్త్రీకి స్థానంఇస్తూ వున్నాడన్నమాట.

దీనిలో సమానత్వం ఏముంది ?

రాజకీయాలలో పాల్గొనడానికి స్త్రీలకు అనుమతిఇచ్చి కాంగ్రెస్ దేశానికి చాలాఅపకారం చేసింది.

ఇందువల్ల భారతస్త్రీలలో వాయువేగంతో మార్పులువస్తున్నాయి.

మరి పదిఏళ్లపాటు ఈఅభివృద్ధిసాగుతూవుంటే

"వివాహంఅనేది ప్రాచినకాలం నుంచీ అనుస్యూతంగావచ్చే మూఢవిశ్వాసము. వివాహంవల్ల నా శరీరాన్ని ఒక పురుషుడికి అతడూ నేనూ బతికివున్నంత కాలమూ తాకట్టుపెట్టడమవుతుంది. ఒకబట్టనే మనం బ్రతికి వున్నంతకాలం కట్టం, తరుచు మారుస్తూవుంటాము. అట్లే భర్తవిషయం కూడాను"

అనే స్థితికి భారతస్త్రీ వస్తుందేమో అని నాభయం.

# మ ణి మా ల

## గతయుద్ధంలో జర్మనీ నష్టం

గత ఐరోపా మహాసంగ్రామంలో ఓడిపోయిన పిమ్మట జర్మనీ వర్సెలెయిస్ సంధి కాలంలో సర్వభ్రష్టమైపోయింది.

జర్మన్ పౌరులలో 17,00,000 మంది యుద్ధంలో నిహతులయ్యారు. 42,00,000 మందికి గాయాలు తగిలాయి. 11,50,000 మంది ఇపు, అజ లేకుండా పోయారు.

అల్సేస్ లారోయిన్ భాగమూ, పోసెన్‌లో విశేషభాగమూ, పడమటి ప్రష్యాలో చాలాభాగమూ జర్మనీ కోలుపోయింది. వలసరాజ్యాలనన్నిటిని పోగొట్టుకుంది.

ఒకకోటి ఎనభైలక్షలమంది పౌరుల్ని, పదిలక్షల చతురపుమైళ్ళ ప్రదేశాన్ని, బొగ్గులో నూటికి 45 వంతులు, ఇనుములో నూటికి 65 వంతులు, వ్యవసాయ క్షేత్రాల్లో నూటికి 15 వంతులు, ఫ్యాక్టరీలల్లో నూటికి 10 వంతులు, వ్యాపారనౌకలలో 51,00,000 టన్నుల తూకంగల ఓడల్ని కోలుపోయింది.

1,05,000 టన్నుల బెన్‌జాల్; 1,50,000 టన్నుల కోల్‌టార్; 90,000 టన్నుల సల్ఫేట్ ఆఫ్ అమ్మోనియా; 500 విత్తులు కొట్టబడని గుఱ్ఱాల్ని; 30,000 ఆడగుఱ్ఱాల్ని; 2,000 ఎద్దుల్ని; 90,000 ఆవుల్ని; 1000 గొఱ్ఱెపొట్టేళ్ళను; 1,00,000 గొఱ్ఱెల్ని; 10,000 మేకల్ని జర్మనీ ఫ్రాంసుదేశానికి ఇచ్చుకోవలసి వచ్చింది.

అంతేకాదు, 1921 మే లోపుగా 100,00,00,000 (నూరుకోట్లు) పౌనులు అపరాధంగా ఈయడానికి అచ్చుకుంది. ఆపైకంలో కొంతభాగంమాత్రమే జర్మనీ ఈయగలిగింది.

—*Time,*

## ప్రపంచచరిత్రలో ఒకగంట

ప్రపంచచరిత్రలో ఒకగంటకాలంలో

| | |
|---|---|
| పుట్టుకలు | 5,440 |
| చావులు | 4,630 |
| పెళ్ళిళ్ళు | 1,200 |

జరుగుతున్నాయి.

| | |
|---|---|
| రొట్టె | 7,00,00,000 పౌనులు |
| బంగాళాదుంపలు | 5,00,00,000 ,, |
| తేయాకు | 20,00,000 ,, |

తినివేయబడుతూవున్నాయి.

| | |
|---|---|
| బొగ్గు | 1,70,000 టన్నులు |
| పంచదార | 31,000 ,, |
| బంగారం | 4,000 ఔన్సులు |

తయారు అవుతూవుంది.

—*League Statistics,*

## వజ్రముయొక్క శక్తి

అనాదికాలంనుంచీ వజ్రములు మొదలయిన రత్నాలకు ఏదో మహాత్మ్యం వుందనే నమ్మకం మానవులలోవుంది.

ఆరీతి నమ్మకాలు నేటికికూడా కొన్నికొన్ని రత్నాల్నిగురించి వుండనే వున్నాయి.

రక్షరేకులుగా, యంత్రపు బిళ్ళలుగా ఉపయోగిస్తాయి అనీ; అవి మంత్రశక్తిని కలిగి వుంటాయి అనీ నమ్మకంవుండబట్టే కొన్నికొన్ని నగలు ధరింపబడుతూ వున్నాయి అని చెప్పవచ్చు.

రాళ్ళలో వజ్రం అతికఠినమైనది. వజ్రం వజ్రంచేతనే కోయబడుతుందని నానుడి.

శక్తిమంతములూ, సౌందర్యయుతములూ అయిన నగలలో వజ్రం శ్రేష్ఠమైనదిగా విశ్వసింపబడుతూవుంది.

ఈవజ్రాలకు రోగనివారకశక్తికూడా వున్నట్లు మానవుల విశ్వాసం.

వజ్రానికి షడ్రుచులు- తీపి, పులుపు, ఉప్పు, కారము, చేదు, వగరు- వున్నాయి అనీ; అందుచేత అది సర్వరోగాల్ని నివారింపజేయగలుగుతుందనీ ప్రజల నమ్మకం.

—*Sunday Statesman,*

## పండితమాలవ్యా

### పూర్వాచారప్రియుడా?

పండితమాలవ్యా మిక్కిలి పూర్వాచారప్రియుడని పలువురి హిందువుల అభిప్రాయం. ఇంతకంటె దురభిప్రాయం మరిఒకటిలేదు. తరతరాలుగా సంతరింపబడ్డ బ్రాహ్మణ్యం అతనిలో ప్రస్ఫుటమైవుంది.

అతన్నిగురించి ఒకకథ చెబుతారు. ఒకసారి అతడు మహాత్మాగాంధితోకలిసి సహపంక్తిని భోజనంచేసి ఆపాపపరిహారార్థం కాశీపట్టణానికి వెళ్ళి గంగానదిలో అఘమర్షణస్నానం చేశాడని చెబుతారు.

ఈ కథ నిజముకాకపోవచ్చు. ఏమంటే మహాత్ముడు పూనాలో ప్రాయోపవేశదీక్ష వహించినప్పుడు మాలవ్యా నాయకుల సమావేశాన్ని ఒక దానిని

ఏర్పాటుచేశాడు. అతని అధ్యక్షతను ఆ సమావేశం అస్పృశ్యతా నివారణకు కంకణబద్ధమైనది.

అతనివంటి సనాతనాచారప్రియుడి విషయంలో ఇది అపూర్వ విషయం కాదా? అతడు హృదయంలో సనాతన సంప్రదాయుడే. ఆచరణలో మాత్రం సంస్కర్త.

—*The Sunday Standard,*

## కాంగ్రెస్ నాయకుల స్వార్థనీతి

ఆగ్రాకు చెందిన రామపరిషద్ భట్టు కాంగ్రెస్ అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్ కు వ్రాసిన బహిరంగలేఖలో కాంగ్రెస్ నాయకుల స్వార్థనీతిని బయటపెట్టే ఈ క్రింది సంగతులు వెల్లడిచేయబడ్డాయి.

"వల్లభాయ్‌పటేలు కొడుకు ఓరియంటల్ ఇన్సూరెన్సుకంపెనీలో నెలకు తొమ్మిదివందలరూపాయిల జీతగాడైవున్నాడు. ఇది కాంగ్రెస్ ప్రతిష్టను స్వార్థానికి ఉపయోగించడం కాదా?

మహాత్మాగాంధికొడుకు దేవదాసు గాంధి ఢిల్లీలో బిర్లామహాశయుని హిందుస్థాన్ టైమ్సు పత్రిక కార్యాలయంలో నెలకు 500 రూపాయిలు పుచ్చుకుంటున్నాడు. అతనికి ప్రత్యేకం ఒకకారు కూడా ఈయబడింది. ఈ దేవదాసు గాంధి ఏమి చదువుకున్నాడు? అతడు ఏయే పరీక్షలుప్యాసుచేశాడు? ఈ ఉద్యోగం పొందడానికి అతనికిగల ప్రత్యేకమైన అర్హతలు ఏమిటి?

ఢిల్లీ అసెంబ్లీలో ఇన్సూరెన్సు శాసన చర్చలో ఇన్సూరెన్సు కంపెనీల తరపున వాదించడానికి భుల్లాభాయిదేశాయి 35,000 రూపాయిలు పుచ్చుకున్నమాట నిజంకాదా? స్వదేశసంస్థానాధీశులనుండి అతడు చాలాడబ్బు తీసుకుని వుండడాన్ని అతని మైసూరు ఉపన్యాసం వెల్లడించడంలేదూ?

ఇక సర్దారు వల్లభాయిసంగతి. అతని సోదరుడు విఠల్‌భాయి శవం బొంబాయి వీధుల్లో కొనిపోబడుతూవున్నప్పుడు దానివెంట లక్షలకొలది ప్రజలు వెళ్లారు. కాని బొంబాయిలో వుండికూడా వల్లభాయి వెళ్ళలేదు. అట్టి వల్లభాయి ఇటీవల దావాచేసి అన్నఅర్థాన్ని స్వాధీనం చేసుకున్నాడు. పార్లమెంటరీబోర్డు కోసం అతడు వసూలుచేసిన రెండులక్షల రూపాయిలకు జమాఖర్చులేదు. బొంబా

యి ప్రావిన్షియల్ కాంగ్రెస్ కమిటీకి సర్దార్ మేనల్లుడు కాషియర్. అతడు ఆకమిటీడబ్బు 2,500 కాజేశాడు. ఆసందర్భంలో విచారణకర్తగా నియమింపబడ్డ భుల్లాభాయి దానిని కప్పిపుచ్చాడు.'

—*New Orissa,*

## హిందూదేశంలో తేనెపరిశ్రమ

అనాదికాలంనుంచి తేనెటీగల ఉనికి హైందవులకు తెలిసినవిషయమే. కాని తేనెటీగల పెంపకం ఈదేశంలో బాగా అభివృద్ధి పొందలేదు.

భారతదేశంలో ఏటేట ఎంతెంతో తేనె ఉత్పత్తిచేయబడుతూవుంది. కాని తేనెపట్టునుండి తేనెతీసే విధానం సరిగ్గా తెలియక మంచితేనె దొరకడంలేదు.

సరియైనపద్ధతిలో తీయబడని కారణంచేత తేనె పులిసిపోయి బెల్లపుపాకంకంటె కనాకష్టమైపోతూవుంది. పైగా తేనెను అమ్మే వర్తకులు దానిలో కల్తీ కలుపుచున్నారు. దాన, దీన నికార్సయిన తేనె ఈదేశంలో అపరూపపు వస్తువ అయివుంది.

ఈమాదిరి తేనె రూపాయికి ఐదు మొదలు ఎనిమిది పౌనులవరకు అమ్ముతారు. విదేశాలకు రవాణా ఏమీలేదు.

డార్జిలింగ్ జెయిలులో తయారయ్యే మంచితేనె పౌను రూపాయికి అమ్మడం కూడావుంది.

పూనాలో తయారయ్యే తేనె విదేశాలనుంచి మనం దిగుమతిచేసుకునే తేనెకంటె ఎన్నోరెట్లు ప్రశస్తంగావుంది.

కాగా తేనెటీగలపెంపకాన్ని గురించి, తేనెపట్టునుంచి తేనెనుతీసే విధానాన్నిగురించి, తేనె నిలవచేసే విధాన్నిగురించి శాస్త్రీయవిషయాలు తెలిసికొంటిమంటే భారతదేశమున తేనె పరిశ్రమను లెస్సగా పెంపొందింపవచ్చునని తేలుతూవుంది.

1850 లో అమెరికా సంయుక్త రాష్ట్రాలలో 1,48,00,000 పౌనుల తేనె, మైనము ఉత్పత్తి అయాయి. మూడేళ్ళతరవాత ఆపరిశ్రమలో కొత్త విధానం అవలంబింపబడింది. ఫలితంగా 1860 లో 2,34,00,000 పౌనులతేనె; 13,30,000 పౌనుల మైనము తయారు అయాయి. 1900 లో తయారైన తేనె 6,12,00,000 పౌనులు - మైనము 18,00,000 పౌనులు.

హిందూదేశంలో అంతటి అభివృద్ధి కలగక పోవచ్చు. ఏమంటే అమెరికా జాతి తేనెటీగలకంటె ఇండియాజాతి తేనెటీగలు తక్కువజాతివి. అయినా కొత్తపద్ధతివల్ల ఇక్కడకూడా తేనె ఉత్పత్తిని రెండురెట్లు పెంచవచ్చు.

—*Indian Information,*

## పాముకాటుకు మంత్రచికిత్స

దక్షిణ ఇండియాలో పాముకాటుకు తమ మంత్రశక్తిచేత చికిత్సచేసే మంత్రగాళ్లు చాలామంది వున్నారు. ముఖ్యంగా మలబారు ఇట్టి మంత్రగాళ్ళకు పుట్టినిల్లు.

మలబారులో కొన్ని కులాలవారు తరతరాలుగా పాముకాటుచికిత్సలో పండితులైవున్నారు. ఆ విద్య ఆకులాలలో వంశపరంపరా వస్తూవుంది.

ఈవిషయంలో ఈకులాలకుగల ప్రతిష్ట సాధారణంగా చెడదు. స్థానికప్రజలకు వారి ఆ అసాధారణశక్తియందు అపూర్వమైన నమ్మికవుంటుంది.

మలబారులో ఒక నంబూద్రి బ్రాహ్మణకుటుంబంవుంది. దానిపేరు 'పాంబు మెక్కావు' అని. పాంబు మెక్కావు అనగా మళయాళభాషలో పాముమంత్రగాళ్లు అని అర్థము. ఆపేరుచేతనే ఆ వంశంయొక్క ప్రతిష్ట ఆవిషయంలో స్పష్టమవుతూవుంది.

ఆకుటుంబంవారికి నాగస్వామి ఇలవేల్పు. వారిఇంటికి వెళ్లినవారికి ఆ యింటినిండా పాములు - తాచు పాములు సహా - తిరుగుతూవుండడం తెలుస్తుంది. పాములు ఇట్లాతిరగడం ఒక్కదొడ్లోనే కాదు. ఇంట్లోకూడానూ.

కొచ్చిన్ రాజవంశంలోని ఒకరాజు విషవైద్యంలో మంచిదిట్టమైన వాడై వుండెను పాముకాటుకు గురిఅయిన వాణ్ణి చూసీమూడ్డంలో అతడు ఆరోగి బతుకుతాడో బతకడో చెప్పగలిగే వాడట.

కాని ఆరాజు కొన్నాళ్లుపోయాక పాముకాటుకు మంత్రాలువేయడం మానివేశాడట. ఏమంటే కొన్ని కొన్నిపాముల కాటుకు మంత్రాలువేయడంవల్ల కొందరు కొందరు దేముళ్లకు కోపం వస్తుందట!

అతడు ఇకమీద పాముకాటుకు మంత్రంవేయననే నిశ్చయానికి వచ్చినతోడనే ప్రజలు పసిపిల్లల్లా ఏడ్చారట!

—*Calcutta News,*

## మహాత్ముడు : సినీమాలు

మద్యపాననిషేధ కార్యక్రమాన్నే కాని షేరుమార్కెట్టు జూదాల, సినీమాల, రేస్‌పందాలా నిషేధానికి ఎందుకు పూనుకోలేదని మహాత్మున్ని ఒకరు ప్రశ్నించారు. ఆ ప్రశ్నకు మహాత్ముని సమాధానం.

"ఇవికూడా పెద్దదోషాలే. వీనిని కూడా నిషేధించవలసిందే. కాని నేను అంతశక్తిమంతుణ్ణికాను. మద్యపానం

దోషంగా ప్రజలు అంతా అంగీకరించారు కాని సినీమా మొదలయిన దోషాలు ఫాషన్ అయిపోయాయి.

షేరుమార్కెట్టు జూదాల్ని నిషేధిస్తే చాలామంది స్నేహితులకు నేను దూరం కావలసివస్తుంది.

రేసుపందాలమీద దండెత్తితే వైస్రాయి దగ్గరనుంచి అందరూ నా విరోధులు అవుతారు.

సినీమాలమీద ప్రతికూల ప్రచారం ప్రారంభించాలెనంటే విద్యార్థికులు కూడా నాకు ఎదురు తిరుగుతారు.

కాగా వీనివిషయంలో నేను ప్రయత్నించడంలేదు. అవి దోషాలని నాకు తెలుసు. వాని నిర్మూలానికి నాకంటె బలవంతుడైన సంస్కర్త కావాలి.

"నేను మద్యపాననిషేధంతో తృప్తిపడతాను."

*—Harijan,*

## 1939 రాజర్షి

పాట్నావద్ద హతవా సంస్థానంవుంది. ఆ సంస్థానాధిపతి కొన్నాళ్ల క్రిందట తన బలగంతో ప్రయాణం జేస్తూ క్రమంగా అందరిని వెళ్లిపొమ్మని తనెటో వెళ్లిపోయినాడు. అతడికోసం ఎంతో వెతికారు. గాన్యాపట్టణంలో ఒకగుహలో కొందరు సాధువులతోపాటు ఉన్నాడట. తండ్రిని కొనిపోవుటకు రాజకుమార్లు తమతల్లితో అక్కడికివచ్చారు. వారెంత ప్రయత్నించినా లాభం లేకపోయింది. ఆరాజు తన భార్యనుగాని కుమార్లనుగాని, చూచుటకు గూడ యిష్టపడలేదు. "నేను మిమ్ముల్ను చూడను, నాకోసరం రావద్దు అని వారిని పంపేశాడు. ఆమహారాజు రైలు మూడోక్లాసులో ప్రయాణంజేస్తాడు. పడుకోవడము ఒక దుప్పటిమీద, ఒక సాధువునుతప్ప ఇంకెవ్వరు తనవద్ద ఉండొద్దంటాడు. ఆజిల్లా మేజస్ట్రీటును ఒకసారి ఆహ్వానించి రహస్యంగా ఒక పెద్ద స్టేటుమెంటు యిచ్చాడు. కొన్నాళ్ళకు అది గవర్నమెంటుకందజేస్తాడట. రాజువద్దకు సంస్థానాధికారులు, రాజవంశీయులు అందరూ వచ్చారు. అందరితోను మాట్లాడాడుగాని, రాణిని రాజకుమారులను చూడడానికి యిష్టపడలేదట. తల్లినితప్ప అందరిని వెళ్ళిపొమ్మన్నాడు. కష్టపడి పనిజేస్తూ వచ్చినదానితో వండుకొని తింటాడుట.

ప్రస్తుతం సంస్థానపరిపాలనను గవర్నమెంటువశం జేస్తాడట. అతడు సంస్థానానికి పోతాడుటగాని, తను చిన్నప్పటినుండి సౌఖ్యంతో పెరిగిన పాట్నాలో ఉండడుట నెలకు రూ 2000 లు తీసుకుంటూనన్నాడు కాని అతనికయ్యే ఖర్చు చాల కొద్ది. మిగతడబ్బంతా దానధర్మాలు జేస్తాడు.

పూర్వకాలంలో మనము ఋషులను గూర్చి చదివాం- మహారాజు ఆఛాయలో కలిసినాడు- అతడు యెప్పుడూ భగవంతుని ప్రార్థించును- రామాయణం పఠిస్తుంటాడు- అప్పుడతనిని చూచినవారికి గూడ పాపం పరిహారమవుతుంది- 'నాకన్న బీద వేరొకడులేడు- ఓవిశ్వస్వరూపా! నీకన్నా సర్వేశ్వరుడు వేరొకడు లేడు' అని ఆమహారాజు ప్రార్థించుచున్నప్పుడు చూచువారందరును గగుర్పాటు చెందుతారు-

పరిస్థితులు తారుమారగుచున్నా ఆ భగవత్ప్రార్థనయే అతని ఆత్మను ఆకర్షించి తనతో ఐక్యము జేసుకొనును.

—జమీన్ రైతు.




## శిరోజాల విషయంలో జాగ్రత్త

తలవెంట్రుకల సుస్థితి అనునిషి ఆరోగ్యానికి మంచి గుర్తు. మధురమైన పదార్థాలు ఎక్కువగా వాడడం— జీర్ణశక్తి బాగా లేకపోవడం - నిద్ర తక్కువగా వుండడం - నరాలు నిరంతరం వుద్రేకస్థితిలో వుండడం - చుట్ట, సిగరెట్టు, బీడీలు విస్తరించి కాల్చడం - మద్యాన్ని మితిమీరి తాగడం - బరువైన ఆహారం తినడం మొదలయినవి తలవెంట్రుకల ఆరోగ్యాన్ని పాడుచేస్తాయి.

మంచి ఆరోగ్యపద్ధతులుతప్ప వెంట్రుకలకు నల్లని నున్నని స్థితి తిరిగి తేవడానికి, బట్టతలపోగొట్టడానికి సమర్థమైన రసాయనం, తైలం మొదలయిన మందులు ఏమీలేవు.

సరిపోయిననిద్ర, అవసరమైనంత దేహపరిశ్రమ, క్రమమైన మలవిసర్జన, పుష్టిని ఇచ్చే తేలికభోజనం తలవెంట్రుకల ఆరోగ్యాన్ని కాపాడడానికి అమోఘసాధనాలు. సౌందర్యపోషకవస్తు విక్రయశాలనుంచి వచ్చే క్రీములకు, లోషన్‌లకు ఇంతటి సమర్థత లేదు.

ఆరోగ్యమార్గానికి అనువైన ఈ సాధనాలు అన్నీ మనలో అందరూ సర్వకాలానికీ పొందగలిగివుండే పాటి అదృష్టవంతులు కాకపోవడంకూడా సత్యమే.

కాని మన ప్రయత్నం ఎంతసేపూ ఆ సాధనాల్ని స్వాధీనంలో వుంచుకోవడానికి ప్రయత్నించాలి. అవి స్వాధీనంలో వుంచుకోవడంవల్ల కలిగే ఫలితాలు సౌందర్యపోషకవస్తువుల్ని ఆశ్రయించడంచేత కలిగే ఫలితాల కంటె చిరకాలం వుండేవి అవుతాయి.

*–Consumers' Digest.*

## తాగుడు ఆయుర్దాయాన్ని తగ్గిస్తుంది

తాగుడు అభ్యాసం అసలే లేనివారి కంటె మితంగా మద్యపానం చేసేవారు సగటున నాలుగేళ్లు తక్కువకాలం జీవిస్తారు. మితిమీరి తాగేవారి ఆయుర్దాయం దాదాపుగా ఆరున్నరసంవత్సరాలు తగ్గిపోతుంది,

తాగుడు దురభ్యాసానికి తగులుకున్న వారికి ఆయుర్దాయం తగ్గిపోవడమే కాదు. వారికి తరుచు జబ్బుచేస్తూవుంటుంది. తాగుడు దురభ్యాసంలేనివారికి(అసలు జబ్బుచేయడమంటూవుంటే) ఒక్కసారి జబ్బుచేసేలోపుగా మద్యపానప్రియులకు కనీసం మూడుసారులేనా జబ్బుచేస్తుంది.

తరుచు జబ్బుచేయడం ఒక్కటేకాదు. తాగుడుదురభ్యాసంలేనివారి జబ్బు త్వరగా నయమవుతుంది. వీరిజబ్బు నయమయ్యేకాలం కంటె మద్యపానప్రియుల జబ్బు నయంకావడానికి రెండున్నర రెట్లు హెచ్చుకాలం కావలసివుంటుంది.

*–Fact Digest.*

## గాడిదపాలు ఆరోగ్యప్రదమైనవి

హిందూదేశంలో ప్రచురింపబడే ఒకానొక శాస్త్రీయపత్రిక వ్రాతప్రకారం గాడిదపాలు ఆవుపాలకంటె ఒకటిన్నర రెట్లు సులభంగా జీర్ణమయ్యేవిగా వుంటాయి.

రోగగ్రస్తులకు ఆహారంగా, పిల్లలకు ప్రధానమైన ఆహారపదార్థంగా గాడిదపాలు పలుదేశాల్లో వాడబడుతూ వున్నాయి.

*–New Ideas.*

## పొగాకువాడకం చెవికి చెరుపు చేస్తుంది

ఎక్కువగా పొగాకువాడడం, మద్యాన్ని ఉపయోగించడం చెవికి హాని చేస్తుంది. అందువల్ల బ్రహ్మచెముడు కూడా పట్టవచ్చు.

వెంట్రుకలకు రంగువేయడానికి అనిలైన్ రంగులు విశేషంగా వాడడం కూడా చెవికి చెరుపే.

క్వినైన్, మార్ఫిన్ మొదలయిన మందుల వాడకంవల్ల చెవికి కలిగేహాని కొలది ఇడరానిది.

చెవిసంబంధమైన రోగాలతో బాధపడేవారు పొగాకును ఎంతమాత్రం వాడకూడదు.

సారాయి, ఆల్కహాలు మొదలయిన వానివాడకం సాధారణంగా కంటికే చెరుపుచేసేది అయినా ఒక్కొక్కప్పుడు అది చెవికికూడా చెరుపుచేయడం కద్దు. అది చెవికిచేసిన చెరుపు ఇక ఏమందులచేతా చెరపరానిది అవుతుంది.

ఈసంగతులు అమెరికన్ ఓటోలాజికల్ సొసైటీవారి ఒక సమావేశంలో డాక్టర్ హెచ్. మార్షల్ టెయిలర్ వెల్లడిచేశాడు.

*—Think*

## బాగాముసలివాళ్ళకు జబ్బుచేస్తే

బాగా ముసలివాళ్ళకు జబ్బుచేసినప్పుడు వాళ్ళను అస్తమానూ మంచంమీదే పడుకోపెట్టి వుంచుతే వారికి చావు శీఘ్రంగా పైబడుతుందని ఫిలాడెల్ఫియాకు చెందిన లూయీ బి. లాఫ్లేన్— జె. టి. నికల్సన్ అనే డాక్టర్లు చెబుతూవున్నారు.

జబ్బుచేసిన ముసలివాళ్లు ఏమీపనిలేకుండా అస్తమానూ మంచంమీద వెల్లకిత్తలా పడుకుని వుండడంచేత హృదయానికి నల్లరక్తాన్ని తీసికొనిపోయే రక్తనాళపు సిరలలోనూ, హృదయస్థానంలోనుండి శరీరంలోకి శుద్ధరక్తాన్ని కొనిపోయే శుద్ధరక్తనాళాల్లోనూ రక్తంపేరుకుపోతుంది.

అట్లా పేరుకుపోవడంవల్ల రోగి శరీరంలోని రక్తపరిమాణం తక్కువైపోతుంది. అసలే మనిషికి అరవై ఏళ్లు దాటినతరువాత రక్తనాళాలు కొంచెంగట్టిబారుతాయి. అందులో పైనచెప్పిన స్థితికూడా కలిగితే ఆమనిషి రక్తపరిమాణం, రక్తచలనం తగ్గిపోతుంది.

రక్తం గడ్డకట్టి అక్కడక్కడ పేరుకుపోవడంతో లోపల కురుపులు లేస్తాయి, కండరాలబలం తగ్గుతుంది. అందుతో రోగికి నిస్సత్తువ, మైకము, మత్తు, మూర్ఛ, జడత్వమూ కలుగుతుంది.

రోగి ఊపిరితిత్తులు క్రిమిపూర్ణాలు అయి శ్వాసకోశవ్యాధి అంకురిస్తుంది. ఈస్థితి కలగకుండా నిరోధించాలంటే ముసలిరోగులు వీలయినంతగా మంచాన్ని వదులుతూవుండాలి. కొద్ది ఆరోగ్యం కలగడంతోటే మంచంమీదనుంచి లేచేటందుకు వారికి డాక్టరు అనుమతి ఈయాలి.

దీర్ఘకాలం మంచంమీద వుండక తప్పనప్పుడు వారికి కూడినమట్టుకు మృదువుగా అంగమర్దనమూ, మంచంమీద వుండగానే చేయతగిన తేలిక అయిన దేహపరిశ్రమ, దీర్ఘంగా గాలి పీల్చడం మొదలయిన ప్రాణాయామసంబంధమైన పనులు, తరుచు పక్కమీద ఒత్తిగిలుతూ వుండడం మొదలయిన ఉపచారాలు జరగాలి.

*—Neues Wiener Jour*

## ఆక్రోటులో 'సి'విటమిన్

సోవియట్ రష్యాలోని ఒక సుప్రసిద్ధ శాస్త్రవేత్త బాగాముదిరిన ఆక్రోట్లో 'సి' విటమిన్ పాలు హెచ్చుగావుందని కనుగొన్నాడు.

మాల్డేవియన్ అగ్రికల్చరల్ ఇన్స్టిట్యూట్కు చెందిన శాస్త్రవేత్త ఒకడు రెండుపౌనుల ముదురు ఆక్రోటులో ఏడు మొదలు ముప్ఫయి గ్రాములవరకు 'సి' విటమిన్లు కలవని పరిశోధనవల్ల తేల్చి లోకానికి ఎరుకపరచాడు.

ఇంతవరకు 'సి' విటమిన్ సరఫరాకు నిమ్మకాయలను మించినవి లేవని లోకాభిప్రాయం. కాని ఇప్పుడు 'సి'విటమిన్ సరఫరా విషయంలో ముదురు ఆక్రోటులు నిమ్మకాయల్నికూడా మించాయి అని తేలింది.

*—Reuter,*

## వెంట్రుకలకు రంగువేసే మందులవలని హాని

వెంట్రుకలకు రంగువేసే మందులు చాలా హానిప్రదమైనవి. అందులో అనిలైన్ జాతి రంగులతో చేయబడిన మందులు మరీని. వాటివాడకంవల్ల చర్మం వాచి మంటపెట్టడం సంభవిస్తుంది. కళ్ళకుకూడా చాలా చెరుపు కలగడంకద్దు. ఇవి విషతుల్యమైనవి. వీనివాడకంవల్ల కొందరికి మృత్యువుకూడా ప్రాప్తమైనది.

ఈసంబంధమైన కొత్తమందులు మార్కెట్టులోకి వచ్చినప్పుడల్లా చర్మవ్యాధులు విస్తరించడం ఆసుపత్రుల అధికారుల అనుభవంలోని విషయం.

*—Health and Hygiene.*

# విజ్ఞానవిషయములు

చైనావారి ఆత్మహత్యాపద్ధతుల్లో మానూలు ఉప్పును ఒక కప్పు తినివేయడం ఒకటి. మోతాదు తప్పిన ఉప్పు కడుపులోని పేగులకు హానిచేస్తుంది. జఠరకోశం వాచిపోయి ప్రాణాపాయాన్ని కలిగిస్తుంది.

... ... ...

నిద్రపోయేటప్పుడుకూడా చేపలు కళ్లు తెరుచుకునే వుంటాయి. ఎమంటే వాటికి కనురెప్పలు లేవు. పరిశోధనవల్ల కొన్ని చేపలు నిద్రకు ఒక్క రాత్రికాలాన్నే ఉపయోగించవనీ, పగటివూట కూడా బాగా నిద్రపోతాయి అనీ తేలింది.

... ... ...

అతిలోకప్రజ్ఞాశాలురు వారి తల్లిదండ్రులకు చిన్నతనంలో పుట్టినవారు కారు. సాధారణంగా వారు వారి తల్లిదండ్రుల వృద్ధాప్యంలో పుట్టినవారై వుంటారు.

... ... ...

ఇంగ్లండులోని శాలిస్‌బరీ చెంత 1719-వ సంవత్సరంలో మానవుని అస్తిపంజరం ఒకటి కనుగొనబడింది. దాని పొడుగు తొమ్మిది అడుగుల నాలుగు అంగుళాలు.

... ... ...

ప్రధానం, వివాహం మొదలయిన శుభకార్యాల సందర్భంలో తెల్లటి దుస్తులు ధరించడం చలుదేశాల్లో ఇప్పటికిన్నీ ఆచారమైవుంది.

... ... ...

దేవదారు వృక్షాలు 700 సంవత్సరాలవరకున్నూ, రెడ్ బీచ్ చెట్లు 245 సంవత్సరాలవరకున్నూ, సిందూరవృక్షాలు 410 సంవత్సరాల వరకున్నూ, నరమామిడిచెట్లు 145 సంవత్సరాలవరకున్నూ బ్రతుకుతాయని కనుగొనబడింది.

... ... ...

గుర్రం ఏడుఅడుగుల ఎత్తుకు ఎగరగలదు. పదిగజాలదూరానికి దుమకగలదు.

... ... ...

వెదురు ఇరవైనాలుగు గంటల్లో మూడు అడుగులవరకు ఎదుగుతుంది.

... ... ...

మానవుని మెదడు ఒకసమయంలో ఒకేవిషయాన్ని గురించి కేంద్రీకరిస్తుంది. ఆసమయంలో ఇతరవిషయాల్ని వెనక్కినెట్టుతుంది.

... ... ...

కళ్లు ఏవస్తువునైనా తదేకదృష్టితో చూస్తూవుంటె ఆమనిషి చెవులయొక్క వినేశక్తి ఆసమయానికి డింసుపాటు పొందుతుంది.

... ... ...

మాలకాకులు మరీ బొంగురుగా విచారంగా కూస్తే గాలిపాటు సరిగా వుండబోదని కొందరు దేశస్థుల నమ్మకం.

... ... ...

చైనాదేశంలో పట్టణాల్లో వీధులు ఎప్పుడూ నిడుపుగా వుండవు. వంకరటింకరగా వుంటాయి. నిడుపుగావుంటే ఆ వీధుల్లో దెయ్యాలు సులువుగా ప్రవేశిస్తాయి అని చీనావారి నమ్మకమైవున్నది.

... ... ...

ఒక ద్రాక్షతీగెను ఒకరాత్రి, ఆమరునాటి ఉదయాన్ని, ఆనాటిరాత్రి కొలిచిచూస్తే అది పగటికంటె రాత్రివూట రెండుమూడు రెట్లు ఎక్కువగా ఎదిగివుండడం తెలిసివస్తుంది. పగటివూట అంతా అతీగె పోషకపదార్థాల్ని సేకరించుకొంటుంది. రాత్రివూట వాటిని జీర్ణించుకొంటుంది. ఒక్క వృక్షజాతిలో నేకాకుండా జంతుజాతిలో కూడా ఇదే పద్ధతి.

... ... ...

ప్రపంచంలోని వివిధ ప్రదేశాల్లోగల కాఫీతోటయజమానులు కాఫీ ఆకులు తిన్నపిమ్మట ఉడతలు, ఏనుగులు ఎక్కువ ఉత్సాహాన్ని కనబరచాయి అని చెబుతారు. కాఫీపళ్లు తిన్నతరవాత పిట్టలు బాగా కూశాయట! - కోతులు బాగా చురుగ్గా గంతులు వేశాయట!

... ... ...

పాములన్నీ చెవిటివే. నాగస్వరానికి అవి ఆడడమంతా నాగస్వరపుబుర్ర కదలికనుపట్టి.

... ... ...

కవలలో మొదటపుట్టింది పెద్దదా, ఆపిమ్మట పుట్టింది పెద్దదా? హీబ్రూ న్యాయప్రకారం మొదటపుట్టింది పెద్దది. లాటిన్ న్యాయంప్రకారం రెండోసారిపుట్టింది పెద్దది. గర్భకోశంలో బాగా వెనక్కివున్నది ముందుగర్భంలో

పడింది అయివుండాలి అని లాటిన్ న్యాయం. ఆధునిక న్యాయం ప్రకారం ముందు పుట్టినబిడ్డ కవలల రెండింటిలోనూ పెద్దది.

... ... ...

పెర్షియాదేశంలో కొన్ని ప్రాంతాల్లో ఒక పెద్దమనిషికి ఒక స్త్రీ పరిచయం చేయబడే సందర్భంలో అతడు మోకరించి ఆ స్త్రీయొక్క కాలిజోళ్లు ముద్దుపెట్టుకుంటాడు.

... ... ...

టిబెట్టు దేశీయులలో పరిచితులు ఒండొరుల్ని కలుసుకొనేటప్పుడు వారు ఒండొరుల నాలుకలను రాచుకొంటారు.

... ... ...

హృద్రోగం ఆడవారిలో కంటె మగవారిలోనూ, నీగ్రోలలోకంటె తెల్లవారిలోనూ, కార్మికులలోకంటె ఉద్యోగులలోనూ, వ్యాపారులలోనూ ఎక్కువగా వుంటుంది.

... ... ...

చాదీమీద సాధారణంగా వుండవలసిన ఎముకలు రెండుపక్కలా చెరి పన్నెండూను. కాని చాలామందికి పదకొండుకాని, పదమూడుకాని వుంటాయి.

... ... ...

జర్మనీలో 55,259 గురు డాక్టర్లు వున్నారు. అందులో 4,339మంది స్త్రీలు.

... ... ...

అమెరికాలోని జార్జిటవున్ యూనివర్సిటీ 5000 కపాలాలు సేకరించడానికి నిశ్చయించింది. అన్ని కపాలాలు ప్రపంచంలోని ఏ విశ్వవిద్యాలయంలోనూ లేవు. లెనిన్ గ్రేడ్‌లోని బెచ్‌టెరేవ్ ఇన్‌స్టిట్యూట్‌లో 3000 కపాలాలు మాత్రమే వున్నాయి.

... ... ...

ఆత్మహత్యలకు జపాన్, జర్మనీలు పేరుమోసాయి. జపాన్‌లో అది ఒక పవిత్రకర్మ. అది హారకిరి. జర్మనీలో ఆత్మహత్యలకు ఎక్కువపని, నిరుత్సాహపరిస్థితులు కారణం.

... ... ...

ప్రపంచంలో ఉపయోగింపబడే ఆహారపదార్థాలలో వరిబియ్యం జాస్తి.

... ... ...

సీమరేగిపండు తిన్నతరువాత నోరు మంచి వాసన వేస్తుంది.

... ... ...

డచ్చి, స్వీడన్, నార్వే జాతీయులు ప్రపంచంలో అందరికంటె కాఫీ యెక్కువగా తాగుతారు.

# అన్ని ఉద్యోగాల్లోనూ ఆంధ్రులకు అన్యాయమే జరుగుతూవుంది

సునాయక ప్రముఖులు ఎనిమిది రాష్ట్రాలలో మంత్రివర్గముల నేర్పరచి ప్రజాపరిపాలన సాగించుట తటస్థించినది. ఇట్లు కాంగ్రెసువారు అధికారము చేపట్టుటచేత తమ కోర్కెగట్టెక్కునని ఆంధ్రులు కొండంతయాశతో నుండిరి. అసెంబ్లీ ఎన్నికలయిన పిదప కలకత్తాలో నడిచిన అఖిలభారతకాంగ్రెసు సంఘమువారి సభలో ఆంధ్రరాష్ట్ర నిర్మాణానుకూలమైన తీర్మానము సర్వజనాంగీకారమును బడసింది. అటుపిమ్మట మదరాసు అసెంబ్లీ కౌన్సిలులోనుగూడ ఆంధ్రరాష్ట్ర నిర్మాణముతోపాటు కర్ణాటక కేరళ తమిళ రాష్ట్రముల నిర్మాణములుగూడ గావించవలెననుతీర్మానము సర్వజనాంగీకారమును పొందినది. మరియు దానిని ప్రభుత్వమువారును అంగీకరించుటయ్యెను. ఇట్లు తమచేత అంగీకృతమైన తీరుమానము ఇండియాస్టేటుశక్రటరీకి నివేదించుచు ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకుగల ప్రత్యేకార్హతలను గూడ నిరూపించిరి. ఇట్లు రెండుసారులు నివేదించినను ఇండియా కార్యదర్శిగారు అంగీకరింపక నిరాకరించుట సంభవించినది.

ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకు సమ్మతించిన యెడల భారతదేశమున ఇతర ప్రాంతములందు సయితము ప్రత్యేకరాష్ట్ర విభాగ సమ

౫౨-వ పేజీ తరువాయి

స్య ప్రబలమై సరిహద్దులను గురించియు, ఆర్థికసామర్థ్యమును గురించియు, ప్రశ్నలు బయలుపడి పరిస్థితులు విషమించుననియు ఇప్పటి రాజకీయపు ఒడుదుడుకులలో అట్టి విషమ పరిస్థితుల నెదుర్కొనుట సాధ్యముకాదనియు, ఇండియా కార్యదర్శిగారు ప్రత్యుత్తర మిచ్చినట్లు ఈనెలలో జరిగిన అసెంబ్లీ సభలో ప్రధాన మంత్రి ఉపప్రశ్నల సమాధానములవలన తెలిసినది.

ఇరువదియారు సంవత్సరముల నుండి ఆంధ్రదేశము అన్నిమూలల నుండి ఆంధ్రరాష్ట్రన్ని కావలెనని ఉద్ఘోషించుచు, సైమను కమీషనువారు వారినివేదికలో ప్రత్యేకరాష్ట్ర నిర్మాణమున కవశ్యకములని నిరూపించిన యోగ్యతలు ఆంధ్ర మండలములకు కలవని ఋజువుచేయుచు తుదకు మదరాసు ప్రభుత్వమువారి యామోదమును బొందిన ఈఆంధ్ర రాష్ట్రసమస్యను కొలదికాలము క్రిందట తలపెట్టబడినట్టియో, తలపెట్టక పోయినను ఊహామాత్రముగనో లేక స్వప్నదృశ్యముగనో యున్నట్టియు ప్రత్యేకరాష్ట్రల సమస్యతో ముడిబెట్టుట ప్రస్తుతము అసమంజసము, అక్రమమునని గట్టిగ చాటించవచ్చును. ఇతరప్రాంతములలో నింతలో ఇట్టి సమస్యలు తీవ్రరూపమెత్తుట యసంభవము. అట్లు రూపమెత్తినను, కాలక్రమమున పరిష్కరింపవచ్చును. ఆంధ్రరాష్ట్ర నిర్మాణమున కవి యాటంకములుగానేరవు.

మఱియు భారతదేశమున ప్రత్యేకరాష్ట్ర విభజన సమస్య క్రొత్తదికాదు. దాదాపు నలుబది సంవత్సరముల క్రిందటనుండియే ఈసమస్య ప్రభుత్వమువారి దృష్టిపథమునందుండినది. 'చక్కని పరిపాలనాసౌకర్యములు సమకూర్చునట్టి దేశఖండములుగ భారతదేశమును విభజించుట యను విషయము అత్యంతావసరములై ప్రాముఖ్యమైన విషయములలో నొకటి'' యని 1902 సంవత్సరములోనే కర్జను ప్రభువు ఇండియా కార్యదర్శికి నివేదించియుండెను. మరల 1911 సంవత్సరములో ఇండియా ప్రభుత్వమువారు ఇట్టి అభిప్రాయము నే విశదీకరించుచు మరియొక నివేదికను పంపియుండిరి. కాబట్టి ప్రత్యేకరాష్ట్ర విభాగ సమస్య ఇండియా కార్యదర్శికి తెలియని క్రొత్తసమస్యగాదు.

ఇదిగాక 1935 సంవత్సరమున వెలువడిన సంస్కరణ శాసనమునకు ముందు సైమన్ కమీషన

తయారుచేసిన నివేదికలలో ఈ భాషాప్రయుక్తరాష్ట్ర విభాగ సమస్య చర్చించబడి ఆంధ్రరాష్ట్రానికి ప్రత్యేకవిభాజ్యయోగ్యతలు కలవని యొకరీతిగ సూచింపబడియున్నది. ఇవియన్నియునిట్లుండ ఏదియో ప్రశ్నయొకటి క్రొత్తగా వెలుపడినట్లు ఇండియా కార్యదర్శి యూహించినది సమంజసముకాదు. మఱియును ఆంధ్రదేశమునను ప్రత్యేకరాష్ట్ర విభాగమును గూర్చి అంతగా ఆందోళన లేదని ఇండియా కార్యదర్శి అనినట్లు సీలివార్త యొకటి వినవచ్చినది.

ఇప్పటికి 26 సంవత్సరములనుంచి జరిగిన మహాసభలు చర్చలు తీరుమానములు ఉపన్యాసములు వార్తాపత్రికలలో వ్రాతలు శాసనసభలలో తీరుమానములు ఈ మొదలైనవి తగినంత ఆందోళన గాకపోయినయెడల మఱియు నింకనెంత గొప్ప యాందోళన కావలయునో తెలియదు.

ఇండియా కార్యదర్శి యోచన లిట్లుండగా కాంగ్రెసు సభాసహాయమును యోచించినయెడల కాంగ్రెసు నిర్వాహక కార్యవర్గమువారు ప్రకృతము ఈ విషయమున తూష్ణీంభావము వహించియున్నారు. అస్సెంబ్లీ ఎన్నికలైన వెంటనే కలకత్తాలో జరిగిన అఖిలభారత కాంగ్రెసు సంఘసభలో ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునుగురించి అనుకూలమైన తీరుమానము ఏకగ్రీవముగ నామోదింపబడినది. ఆ తీరుమానమైన పిమ్మటనే అసెంబ్లీలో పైనుడివిన తీరుమానము ప్రవేశపెట్టబడుట; అస్సెంబ్లీ చేతను, కౌన్సిలుచేతను అంగీకరింపబడుట; ప్రభుత్వమువారు ఆమోదించుటయు ఏర్పడినది. కాని ఆ తీరుమానము ఇండియా కార్యదర్శి చేత అమోదింపజేయు విషయములో కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గమువారేప్రయత్నమును చేసియుండలేదు. అందు నిమిత్తము ఇంగ్లాండుకు ఆంధ్రప్రతినిధిని పంపవలయునని ప్రయత్నము జరుగుచుండగా కాంగ్రెసుసభ్యులైనవారెవ్వరుగాని అందుకై పోగూడదని నిషేధించినారు.

ప్రత్యేకముగ కొందరు ఆంధ్రప్రముఖులు రాయబారముగా నేర్పడి కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారిని దర్శించి ప్రత్యేక రాష్ట్రనిర్మాణమును గురించి సహాయమును కోరగా అట్టిసహాయము తామేమియు చేయబూనమనియును, ఫెడరేషనుకు వ్యతిరేకముగ తీవ్రమగు ఆందోళన సాగించవలసిన ఈ సమయమున ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణమును స్వల్పసమస్యకై తీవ్రమైన ఆందోళన సలుపుట విరుద్ధమనియును కార్యనిర్వాహక వర్గమువారు స్పష్టీకరించిరి. ఫెడరేషను సమస్య అనుకూలమైనతోడనే ఆంధ్రరాష్ట్ర నిర్మాణము సమకూర్చెదమని నుడివియుండిరి. ఇట్లుండగా త్రిపురీ కాంగ్రెసు మహాసభ జరిగినపిమ్మట అఖిలభారత కాంగ్రెసు సంఘసభలో మరల ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణము ఆవశ్యకమను తీర్మానము అంగీకరించబడినది. దానిని అమలులో బెట్టుటకు తగిన ప్రయత్నములు సలుపుట కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గము వారికి విధియైనను అట్టిప్రయత్నము లేవియు తలపెట్టుటలేదు.

ఇట్లు ఇండియా కార్యదర్శి చేత నిరాకరింపబడి, ఇట్లు కాంగ్రెసు కార్యవర్గంవారిచేత నిరసింపబడి నిస్సహాయులమైయున్న మనకు ప్రకృతకర్తవ్యమేమియను విషయమగు ప్రశ్న వెలువడినది.

ఇప్పుడు భారతదేశములో ప్రజాసంబంధమైన ప్రభుత్వమువారివలన పరిష్కృతము గావలసిన యే ప్రశ్నయైనను కాంగ్రెసు మహాసంస్థ జేయు ప్రయత్నమునుబట్టి సఫలముకావలసినదేగాని మఱియొకరి మూలముగ సాధింప వీలుగాదనుట నిశ్చయము—బంగాళ విభజన రద్దుచేయుటకు బంగాళములోని ప్రజానాయకులు వారెంత గొప్పవారైనను, ఎంతగొప్ప సమర్థులైనను కాంగ్రెసు మహాసంస్థ మూలకముగనే ప్రయత్నము చేయవలసివచ్చినదనుమాట అందరికి అనుభవవేద్యమే. విదేశవస్తు బహిష్కారము స్వదేశోద్యమము మొదలగు సునిశితాస్త్రములను కాం

గ్రెసుసంస్థమూలకముగ భారతదేశమందంతట ప్రయోగింపజేసి తీవ్రమగు ఆందోళనసలిపి విభజన రద్దుగావించినారు. కాబట్టి అటులనే మనము కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గ అధిష్ఠాతలను యొప్పించుటకు యుక్తరీతుల గాఢప్రయత్నముసలిపి వారు సుముఖులుగాకున్నచో అఖిలభారతకాంగ్రెసు సంఘమువారి మూలకముగ వారిని యొప్పింపజేసి కార్యసాధనల నాలోచించి కార్యసిద్ధి బడయవలెను. కాంగ్రెసు మహాసంస్థను విడిచి ప్రయత్నముచేయు నేల విడిచిన సాము అనుటకు సందేహములేదు.

మఱియు అన్నిటికంటె ముఖ్యమైన విషయమేమనిన గాంధిమహాత్ముని దర్శించి వారి యామోదమును బడసి వారు సూచించిన మార్గమవలంబించవలెను.

మనకు గాంధిమహాత్ముడే మార్గదర్శి, యుపదేశకుడు. కాంగ్రెసు మహాసంస్థయే శరణ్యము. వీనిని నమ్మి చేసిన కృషియే సిద్ధించును.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణసమస్య సిద్ధించులోపల ఆంధ్రజిల్లాలనుండి వచ్చు ఆదాయమును, ఆంధ్రజనుల ప్రయోజనమునిమిత్తమే వినియోగించుట అవసరము. ఆప్రకారము ఆదాయవ్యయపట్టికను ఏర్పాటు చేసి ద్రవ్యవినియోగము గావించిన యెడల ఆంధ్రరాష్ట్ర నిర్మాణము వలన కలుగగల ప్రయోజనములు కొంతవరకు లభ్యములగును. ఆంధ్రజిల్లాలనుండి వచ్చెడి ఆదాయమును ఆ జిల్లాల నిమిత్తముచేయబడు ప్రయత్నమును నిష్కర్షగా తేల్చవలయునని అసెంబ్లీలో ప్రశ్నలువేసియు, ప్రభుత్వమువారికి వ్రాసియు ప్రయత్నము చేసినప్పటికి సరియైన లెక్కలు లభ్యపడలేదు. 1932-33 సంవత్సరములకు సంబంధించిన లెక్క ఒకకొంత తయారుచేయబడి అస్సెంబ్లీలో ప్రకటింపబడినది. ఆ లెక్కలవలన ఆంధ్ర జిల్లాలవలన వచ్చు ఆదాయము వానిపైన వ్యయముకంటె దాదాపు ఒక కోటి రూపాయలు జాస్తియగుటచేత ప్రతి సంవత్సరం ఆంధ్రుల సొమ్ము ఒకకోటి రూపాయలు రాజధాని మొత్తముమీద ఖర్చు పెట్టబడుచున్నదని తేలుచున్నది. పైనుడివిన ప్రకారము ఆకోటి రూపాయలైనను ఆంధ్రుల నిమిత్తమేవ్యయము చేయునట్లుఏర్పాటుచేయుటవసరం.

మరియొక విషయముగూడ ఈ సందర్భమున వివరించక తప్పదు. సర్కారు ఉద్యోగములలో ఏ యుద్యోగశాఖ చూచినను ఆంధ్రోద్యోగుల సంఖ్య చాల తక్కువయని బహుకాలమునుంచి వినబడుచునే యున్నది కేవలము ఉద్యోగముల నిమిత్తమై ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణమును గూర్చిన యాందోళన సాగించబడుచున్నదని రాష్ట్ర నిర్మాణమునకు వ్యతిరేకులు వాదించుచు వచ్చినారు. కాని ఇంతవరకును ఉద్యోగసమస్యనుగూర్చి ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునుగూర్చి ప్రయత్నించువారే కృషియును గావించి యుండలేదు. దానిని నిర్లక్ష్యభావముతోడనే చూచుచుండిరి. కాంగ్రెసువారు పదవుల స్వీకరించి పరిపాలన ప్రారంభించినపిదప సహితము ఉద్యోగులను నియమిం

చుటలో అధికారులు భేదభావములు చూపుచున్నారనుట కేవలము నిరాధారము కాదు. స్వానుభవమునకు వచ్చిన కొన్ని దృష్టాంతములనుబట్టి ఆ యాక్షేపణ నిజమనియే నమ్మవలసి వచ్చుచున్నది. దినదినము అట్టి విభేదములు అమలులో నున్నవని పత్రికలలో ప్రకటింపబడుచుండగా అవి నిజముగానియెడ నిజముగాదని నిర్ధారణచేయుచు ప్రభుత్వమువారు ప్రకటనచేయుట అవసరము. పెద్ద యుద్యోగములు మొదలు చిన్నగుమాస్తాల విషయములో సహితము ఆంధ్రులు నిరసింపబడు చున్నారను ఘోష నానాటికి పెరిగిపోవుచున్నది. కాబట్టి ఆ విషయమున అన్యాయమున్నదో లేదో తేల్చుటకు మంత్రివర్గమువారికి తీరికలేనియెడ నొక నిష్పక్షపాతబుద్ధిగల యోగ్యులతో గూడిన నొక యుపసంఘము నేర్పరచి ఈ యాక్షేపణలోని నిజానిజములు నిర్ణయించి లోపములు సవరించి ఆంధ్రులకు వారి సంఖ్యకు తగినట్లు ఉద్యోగములలో ప్రాతినిధ్యమిచ్చుట అవసరమని నిష్కర్షగా వక్కాణించవలసి నందుకు చింతించుచున్నాను. తుద కీయార్భాటమంతయు పొట్టకూటికై పోట్లాటయని హేళన చేయువారు చేయవచ్చును. కాని ఈలోకమున మానవుడు చేయుకృషిలో తొంభైతొమ్మిది పాళ్లు ఆ పొట్టకూటికనియే స్పష్టము కాబట్టి న్యాయముగ పొట్టకూటికి చేయుప్రయత్నమైనను నిరసింపదగినది కాదు.

మరియొక్క విషయమును మాత్రము ఉదాహరించి ముగించెదను. ఆంధ్రరాష్ట్రనిర్మాణము నెదిరించువారు కొన్ని యాక్షేపణలను చేయుచున్నారు. కాని ఆ యాక్షేపణలలో యోచింపతగినది నూతన రాష్ట్రముయొక్క ఆదాయ వ్యయములను గూర్చినదే. ఆంధ్రమండలములు ప్రత్యేకింపబడిన యెడల ఈ మండలములనుండి వచ్చెడి ఆదాయము ఇప్పుడు రాజధాని మొత్తమునునుండి వచ్చెడి ఆదాయముకంటె చాల తక్కువగుటచే జాత్యుద్ధరణకు తగిన నిర్మాణకార్యక్రమమును సాగించుటకు సాధ్యముగాదని వారు వాదించుచున్నారు.

రాష్ట్రనిర్మాణ మైనపిదప అందలి ఆదాయసాధనలను ప్రత్యేక శ్రద్ధతో వృద్ధిచేయుట కెక్కువ అవకాశముండును. ఆంధ్రదేశమున సారవంతములైన భూము లనేకములు గలవు. విలువగల ఖనిజములు గలవు. జలాధారములు గలవు. వీటి నన్నిటిని వృద్ధి గావించినయెడల ఆదాయము హెచ్చుకాగలదు. తుంగభద్రా ప్రాజెక్టుబోలిన పెద్దపనుల బూనుటకు కోట్లకొలది ఋణము చేయవలసి నప్పుడు, రాష్ట్రాదాయము స్వల్పమగుటచేత పెద్ద ఋణములు పుట్టవని మరియొక ఆక్షేపణ చేయుచున్నారు. కాని అట్టి పెద్దపనులు కొన్ని సంవత్సరముల మీదగాని పూర్తిగా నేరవు. కావున అప్పటవ్పటికి కావలసినంత మట్టుకే చిన్నఋణములు చేయుటకును వానిని మరల చెల్లించుటకును తగిన ఏర్పాటులు గావించవచ్చును. కాబట్టి ఈ ఆక్షేపణలు సహేతుకమైనవిగావు.



Printed at the Andhrabhumi Printing Works, Vepery, Madras.
Editor & Publisher: Andra Seshagiri Rao. B.A.